# ఆంధ్ర మహిళ


సంపుటి 15 :: ఆగస్టు '59 :: సంచిక 8

వ్య వ స్థా ప కు రా లు :

సంపాదకురాలు :
కె. లక్ష్మీరఘురామ్.



సహాయక సంపాదకురాలు
రామలక్ష్మీఆరుద్ర.


## వి ష య సూ చి క

ముఖచిత్రం

స్వాతంత్ర్య దినం : చిత్రకారుడు కె. భాగేశ్వరశర్మ



## కృతజ్ఞత


1. కుమారి వి. ప్రేమగారు 100 రూపాయలు

2. శ్రీమతి కొసరాజు శ్యామలాగారు 100రూపాయలు

3. శ్రీమతి గంగాబాయి పి. జిపీగారు 100 రూపాయలు మన సభకు యిచ్చి యావ సభ్యులైనందులకు మా కృతజ్ఞత తెలియజేయుచున్నాము.

# దేశకీర్తి

ఏ. సరోజినీదేవి

ఏతల్లి చనుబాలనే మహిమకలదో
      పాశ్చాత్యులను గాంధి పారదోల

ఏమాత తనపాప కేమని బోధించు
      నెహ్రూనేటి ప్రపంచనేత కాగ

ఏనేల లీలగా నెచ్చోట దాగెనో
      రతనాలు ముత్యాలు ప్రబలియుండి

ఏ నది నీరమ్ములేమని ప్రవహించు
      నిత్య సస్యసమృద్ధి నిలుపుచుండి

ఏదేశపు యశస్సు లెలుగెత్తువిశ్వాన
      జ్ఞాన కవితగాన మాలపించి

అట్టి మాభారతావని యందుకొన్న
నేటివిశ్వ విఖ్యాతి మిన్నేటినంటె

పాడరా భారతీయ! నీ ప్రాభవమ్ము
దేశదేశాలు మెచ్చ నీ దేశకీర్తి






సంపుటి 15 :: ఆగస్టు 59' :: సంచిక 8

# కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ కృషి

ఏదైనా కృతజ్ఞత దక్కని సేవవుంటే అది స్వచ్ఛంద సేవ. ఇవాల్యుయేషన్ కమిటీవారి పరిశీలనలు యీ విషయాన్ని నిజం అని రుజువు చేశాయికదా.

సాంఘిక సంక్షేమం పేరిట ఏమాత్రం ధనం సెలవుచేసినా అది దండుగేనన్న దృక్పథం ప్రజానీకంలోనుండి తొలగిపోకపోతే స్వచ్ఛంద సేవకులు నిండు హృదయంతో పనిచేయ కల్గడం కష్టం. ఎందుకంటారా? ప్రతిక్షణం ఎవరో ఒకరు చేసిన ప్రతిపనినీ సహృదయంతో కాకుండా లోపాలను కనిపెట్టే దృష్టితోనే విమర్శిస్తూ వుంటే ఎవరైనా ధైర్యంగా ముందడుగు వేయడం కష్టం.

అందుకే, యీమధ్య మద్రాసులో జరిగిన కేంద్రసంక్షేమసంస్థ రీజినల్ కాన్ఫరెన్సులో ఒక తీర్మానాన్ని ప్రతిపాదించారు. యీ తీర్మానంలో ఇవాల్యుయేషన్ కమిటీవారి సూచనలను, విమర్శలను తీవ్రంగా గర్హించడం జరిగింది. సమావేశమై వున్న రాష్ట్రచెర్మనులూ, ప్రాజెక్ట్ ఇప్లిమెంటింగు కమిటీ అధ్యక్షులూ, ఇతర ప్రముఖ సంఘసేవికలూ, అందరూ ఏకగ్రీవంగా తీర్మానాన్ని ఆమోదించారు. దీనివల్ల - స్వచ్ఛంద సేవకులలో ఎంతటి అసంతృప్తి నిరాశా జనించాయో విదితం అయింది.

కేంద్ర సాంఘిక సంక్షేమసంస్థ సాధించినపని ఏ యితర ప్రభుత్వ సంస్థలూ సాధింపలేవు అన్నది నిర్వివాదాంశం. ఇంత స్వల్పవ్యవధిలో దేశం మొత్తంమీద ప్రణాళికలను రూపొందించి వేలకివేల స్వచ్ఛంద సంస్థలనీ సేవకులనీ ఏకకోవకి తేగల్గినఘనత కేంద్ర సంక్షేమసంస్థకే దక్కింది. ఇదినిజంగా గర్వకారణం కాదా? ఏ ప్రభుత్వమైనా యింతచాకచక్యంతో యింత శీఘ్రంగా కార్యక్రమాలు సాగిస్తుందా? అసలు ప్రభుత్వం అనేసరికే...ఆర్రోజులకి అనుకుంటే ఆర్నెల్లకిఅయినట్టే అన్నవూహాలు ప్రజానీకానికి ఉన్నాయ్. అటువంటిది సాంఘికసంక్షేమం ప్రభుత్వపు పైళ్ళుదాటుకుని వచ్చేసరికి దాని అవసరంకాస్తా తీరిపోదా?

అయినా స్వచ్ఛంద సేవకులకీ సంస్థలకి వున్నంత శ్రద్ధాసక్తులు ప్రభుత్వ సిబ్బందికి ఉండవలసిన అవసరం తక్కువ. వారి విషయాలని ఉద్యోగదృష్ట్యానే చూస్తారు కాని యింకో మానవ అవసరాల దృష్టిలో చూడరుకదా!

1958–59 సంవత్సరానికి సంక్షేమసంస్థ వారు అందించిన నివేదికచూస్తే ఎంత భారీ ఎత్తున దేశంలో పని జరిగిందో కించిత్ అర్థం అవుతుంది. ఆసంస్థ ఎంత బాధ్యతాయుతంగా తన కర్తవ్యాన్ని నిర్వర్తించిందో కూడా అర్థం అవుతుంది.

మాంతా శిశుసంక్షేమ విషయాలలోనూ వికలాంగుల సహాయార్థమూ పనిచేసే సంస్థలకూ యితరకార్యక్రమాలు జరిపించేసంస్థలకు (మొత్తం 2389 సంస్థలకి) కేంద్రసాంఘిక సంక్షేమ సంస్థ ఆర్థిక సహాయం చేసింది. యీ సహాయం మొత్తం 44.07 కోట్లు. ఇదేసంస్థ హోమ్‌శాఖ వారికి సేవాసంస్థల దరఖాస్తులు సిఫార్సుచేసింది. దానిఫలితంగా పదకొండుసంఘాలకి 10,900 రూ గ్రాంటులుగా యిచ్చింది ఆ మంత్రిత్వశాఖ.

ఈ సోషియో ఎకనామిక్ (ఆర్థికమైన సాంఘికావసరాలతో కూడిన ప్రణాలికలు) కార్యక్రమం క్రింద పూనాలో ఒక కో-ఆపరేటివ్ సొసైటీ స్థాపించింది. ఇది అక్కడే పనిచేస్తున్న అగ్గిపెట్టెల పరిశ్రమకి విక్రయానుకూలాలు కల్గిస్తుంది. ఇదేరకంగా సొసైటీలు కోయంబత్తూరు బెంగుళూరులలో స్థాపించడానికి ప్లానులు సిద్ధంగావున్నాయి. కుటీర పరిశ్రమల ఫక్కీలో ప్రారంభించడానికి అనువైన కేంద్రాలు (నాగపూరు బెంగుళూరు, మెడ్రాస్) నిర్ణయించి యూనిట్లుస్థాపించడానికి సన్నాహాలు జరుగుతున్నాయి. కేంద్ర ప్రభుత్వ పారిశ్రామిక శాఖవారు యిటువంటి యూనిట్లు, ఆఫ్టర్ కేర్ హోములకి అనుబంధంగా వుండేవాటి పదకొండింటికి సాంకేతిక దృష్ట్యా ఆమోదించారు.

ఈ సంవత్సరంలోనే వివిధ కేంద్రాలలో 736 సేవికలకు తర్ఫీదునివ్వబడింది. అనుభవం వుండి, క్రమమైన శిక్షణలేని సేవికలను సేకరించి మూడున్నరమాసాల పాటు తర్ఫీదునివ్వడానికని కస్తూరిబా స్మారక నిధివారు నిర్ణయించారు.

20–35 సంవత్సరాల మధ్య వయస్కులైన మహిళలకి విద్యాసౌకర్యాలు సమకూర్చడంకోసం కేంద్ర సంస్థ 52 సంస్థలకి 14, 17, 620 రూ గ్రాంట్లుగా యిచ్చింది. యీ స్కీము ప్రకారం వయోజనులైన యీ మహిళలు వివిధ కార్యక్రమాలకు కావలసిన విద్యార్హతలను పొందకల్గుతారని భావించబడుతూంది.

ముఖ్యసేవికలకి పదినెలలపాటు శిక్షణ నివ్వడానికి కూడా సదుపాయాలు సమకూర్చుతున్నారు. స్వచ్ఛంద సంస్థల ఆధ్వర్యాన నడిచే పద్ధతిమీద అర్బన్ వెల్‌ఫేర్ ప్రాజెక్టులను 69 దింటిని ప్రారంభించింది.

పారిశ్రామిక శాలల్లో పనిచేసే కార్మికులకై రాత్రి తలదాచికొందుకని 38 కేంద్రాలు అనుమతించింది. యీ సంవత్సరంలో, స్వచ్ఛంద సంఘాలకు ఆర్థికసహాయం చేస్తుంది. యిటువంటి "రక్షణశాలలు" నడపడానికి యీ కార్యక్రమాన్ని నడిపించేభారం, భారత సేవకసమాజ్‌వారి వివిధ శాఖలకి అప్పగించ బడింది.

బీద పిల్లలకి విశ్రాంతి సౌకర్యాలు సమకూర్చే స్కీముకూడ కొత్తది ప్రారంభించడం జరిగింది. ఈ కార్యక్రమభారం ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ చైల్డ్ వెల్‌ఫేర్ వారికి అప్పగించారు. ఈ కార్యక్రమంక్రింద పిల్లలు జట్లుగా వేసవి కేంద్రాలకి పంపబడ్డారు.

అంబరు చర్ఖా తర్ఫీదు ఉత్పత్తి కేంద్రాలు, కాన్పూరులో స్థాపింప బడ్డాయి. ఇలాగే యింకా 17 యితర కేంద్రాలలో స్థాపించ డానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

ఇదీ సంక్షేమ సంస్థ ఒక్క సంవత్సరం (ఆర్థిక సంవత్సరం)లో సాగించిన కృషి ఇటువంటి ఉత్సాహవంతమైన కృషికి కృతజ్ఞత తెలుపడానికి బదులు ముఖంమీాద చన్నీళ్లు జల్లినట్లు విమర్శించడం అందులోనూ అర్థంలేకుండా విమర్శించడం నిజంగా శోచనీయమైన విషయం. కాని సహృదయంతో కూడిన స్వచ్ఛంద సేవా సంస్థలకీ సేవికలకీ ప్రజానీకం ఎప్పుడూ నీరాజనం పడుతూనే వుంటుంది.



కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ

# ప్రాంతీయ సమావేశం

జూలై 21,22,23 తేదీలలో మద్రాసులోని రాజాజీ హాలులో కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ ప్రాంతీయ సమావేశం జరిగింది. ఢిల్లీలో కాకుండా యిటువంటి సమావేశం యితరత్రా జరగడానికి యిదే ప్రథమం. ఈ సమావేశానికి కేంద్ర సంస్థ సభ్యులూ, దక్షిణాది రాష్ట్రాల (మద్రాసు కేరళ, మైసూరు, పాండిచెరి) ఆంధ్ర, సంక్షేమ సంస్థల అధ్యక్షులూ ప్రాజెక్టు యింప్లిమెంటింగు కమిటీ అధ్యక్షులూ యితర ప్రముఖ సంఘ సేవికలు విచ్చేశారు.

మొదటి రోజు మద్రాసు రాష్ట్ర ముఖ్య మంత్రి శ్రీ కామరాజ్ సమావేశానికి ప్రారంభోత్సవం జరిపారు. శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్ అధ్యక్షత వహించారు.

శ్రీ కామరాజనాడార్ ప్రసంగించుతూ సాంఘిక సంక్షేమ కార్యక్రమాలు పట్న వాసాలపై కాకుండా పల్లె ప్రాంతాలపై కేంద్రీకరింప చేయాలి. ప్రభుత్వం ప్రజానీకపు జీవన ప్రమాణాన్ని పెంపొందించాలని ప్రయత్నంచేస్తూనేవుంది. సమావేశాలలో తీర్మానాలు ప్రవేశపెట్టిప్రయోజనం వుండదు. సంఘసేవికలు పల్లె ప్రాంతాలకు వెళ్ళి చూసి పని చేయాలి. అప్పుడే వారి కష్టసుఖాలు బాగా అర్థం అవుతాయి ప్రణాళికలు తదనుకూలంగా రూపొందింప వచ్చు అన్నారు. మద్రాసు రాష్ట్ర సంక్షేమ సలహా సంఘపు ఫలవంతమైన కృషికి ఆమోదం తెలియచేశారు.

శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్ ప్రసంగించుతూ యీ సమావేశం ఢిల్లీలో కాకుండ యితర స్థలంలో జరగడానికి యిదే మొదటిసారి అన్నారు. మద్రాసులోని సేవా సంస్థలు కొన్ని నూరు సంవత్సరాలు కూడా దాటినవనీ వాటికి ప్రభుత్వం ప్రజానీకం ఎప్పుడూ సహాయం చేస్తూనే వున్నాయనీ అన్నారు. దక్షిణాదికి 120 ప్రాజెక్టులు వున్నాయనీ వీటిలో 108 దింటికి కమిటీలు వర్పడి వున్నాయనీ. యీ కమిటీలు చాలా మటుకు ప్రణాళికా లక్ష్యాలని అమలులోకి తెచ్చాయనీ, వాటి కృషిని సమీక్షింప వలసిన అవసరం వున్నదనీ అన్నారు. ఇటు వంటి సమావేశం ప్లాను ప్రణాళికలలో పనిచేస్తూన్న సేవికలకి విజ్ఞాన దాయకంగా వుంటుందని అన్నారు అనధికార సభ్యుల కార్య కలాపాలు క్రమంగా ప్రణాళికా కార్యక్రమంలోకి జొప్పించాలనీ, యిది దిన దినం ఎక్కువ కావడం ముదావహం అన్నారామె. ప్రణాళిక లక్ష్యాలు సాధించాలంటే స్వచ్ఛంద సంస్థల సహకారం ఎంతైనా అవసరం అన్నారామె. ఉదాహరణగా చిన్నమొత్తముల పొదుపు ఉద్యమం ఎందుకు విఫలమైనదో సూచించుతూ— స్వచ్ఛంద సేవకులు వందలాది వుండి పల్లె ప్రాంతాల యీ ఉద్యమాదర్శాన్ని తెలియచెప్పే అవకాశం లేకపోయింది అన్నారు శ్రీమతి దేశ్‌ముఖ్.

సంక్షేమ కార్యక్రమాలకై వెచ్చించిన మొత్తాలు "దండుగే" అన్న విమర్శనకు సమాధానం చెప్తూ ఇది చాలా అపోహ అన్నారు. సాంఘిక సంక్షేమం అన్నది ఒక ప్రత్యేకమైన సదుపాయం అనీ- ఇది దారిద్ర్యానికి, అంగవికలులకి, శక్తిహీనులకి, కుంటి గుడ్డి వారికి, ప్రత్యేక తరహా సదుపాయం సమకూర్చడమే

సంఘసేవ. ఇది ప్రభుత్వం సమకూర్చే సాంఘిక సదుపాయాల లాంటిది కాదు. రవాణా సౌకర్యాలు ఆరోగ్య సదుపాయాలు మొగలైనవి ప్రభుత్వం సమకూర్చవచ్చు. కాని వ్యక్తి ప్రాధాన్యం గుర్తించే సేవ అవసరం వుంది. అదే సంక్షేమ సేవికలు చేయదగినది. చేయకల్గినది అన్నారు. సంక్షేమ కార్యక్రమాలు ఒక సూత్రం మీద నడిచేలా చేసి, దిక్కులేని వారికి, అంగవికలులకి, యింకా అనేక సహకారాలు కావలసిన వారికి, సంక్షేమ రాజ్యంగా మనం చేయవలసిన సేవ చాలా వుంది. ఇటువంటి మంచి హృదయంతో తలపెట్టిన కార్యక్రమాలకైనకర్చు దుర్వ్యయం ఎట్లు అవుతుందో ఆశ్చర్యంగా వున్నదనీ, తనకలా కనపడ లేదనీ అన్నారు శ్రీమతి దేశ్‌ముఖ్. ఈ సందర్భంలో. దేశంలో కొందరి విమర్శల దృష్ట్యా స్వచ్ఛంద సేవా సంస్థల స్థానం ఎటువంటిదో ప్లానింగు కమిషనూ, ప్రభుత్వమూ కూడా నిర్వచించాలి అన్నారామె.

ఈ విషయంలో సమావేశ కర్తలు ఆంధ్ర ప్రదేశ్ ఛైర్మన్ ప్రతిపాదించిన తీర్మానాన్ని ఏకగ్రీవంగా ఆమోదించారు. దీనిలో యీ మధ్య ప్రచురింపబడిన ఇవేల్యుయేషన్ కమిటీ వారి రిపోర్టు- పక్షపాతంతో కూడినదిగా వుందిగాని నిష్పాక్షికంగానూ, సమదృష్టిగానూ లేదనీ, ప్లానింగు కమిషనూ ప్రభుత్వమూ, యీ విషయంపై తమఉద్దేశాన్ని ప్రకటించకపోతే, ప్రోజెక్టు యింప్లిమెంటింగు కమిటీ ఛైర్మనులు తమ కర్తవ్యం నిర్వహించడంలో చిక్కులు పడవలసి వస్తుందన్నారు. అనుభవ సంపన్నులైన సంఘ సేవికలు చేయవలసిన పనిని విద్యాధికంగానూ, విద్యారంగంలోనే అభిలాగ గల ఒకే ఒక వ్యక్తికి అప్ప చెప్పడం అంతన్యాయం కాదని యీ తీర్మానం తెలియ చెప్పింది.

మధ్యాహ్నం ప్రోజెక్టు యింప్లిమెంటింగు కమిటీ సభ్యులూ సేవికలూ సమావేశమై తమ తమ సాధక బాధకాలను చర్చించుకొని, సమావేశానికి తెలియ చెప్పవలసిన సూచనలు తయారుచేశారు.

రెండవ రోజున శ్రీ సి. సుబ్రమణ్యంగారి ఆధ్వర్యంక్రింద సమావేశం జరిగింది. శ్రీ సుబ్రమణ్యం మాట్లాడుతూ సంఘసేవ అన్నది పల్లె ప్రాంతాల స్త్రీలలో చైతన్యం తీసుకు వచ్చిందనీ, యిదే తరహాన పనికొనసాగితే తప్పక ప్రణాళికలు విజయవంతం అవుతాయనీ అన్నారు. ఇవేల్యుయేషన్ కమిటీ వారి విమర్శ అన్నది అందరూ తప్పక వినవలసినదే అనీ, ఎటొచ్చీ విమర్శ సహృదయపూర్వకంగా, సలహాగా సలహాగా, సహాయ కారిగా వుండవేగాని కుర్మమలిగా వుండడం తప్పని అన్నారు. పల్లె ప్రాంతాలలో విజ్ఞాన ప్రదం అయిన సాంస్కృతిక కార్యక్రమాలు విస్తృతం కావాలని అన్నారు.

శ్రీమతి దేశ్‌ముఖ్ మాట్లాడుతూ యిప్పటివరకూ మూడు కోట్ల రూపాయలు 7,000 సంస్థలకి పంచి పెట్టడం జరిగింది. రూరల్ వెల్‌ఫేరు ప్రోజెక్టులుగా 500 పాతరకానివి 200 కొత్త రకానివి వున్నాయనీ కమ్యూనిటీ డెవలప్‌మెంట్ ప్రోజెక్టులకు సమన్వయం అయిన యివి దేశం మొత్తం మీద 5000 కేంద్రాలలో వున్నాయి అన్నారు. తర్ఫీదు నందిన సేవికలు లేకపోవడం కారణంగా తమ లక్ష్యం పూర్తిగా సాధింపలేకపోయామన్నారు. యిప్పటి వరకూ 7000 గ్రామ సేవికలు వున్నారు. మాతా శిశు సంక్షేమ కార్యక్రమాలు సాగిస్తున్న సంస్థలకి గ్రాంటు లివ్వాలని నిశ్చయించింది సంక్షేమ సంస్థ. పట్న ప్రాంతాలలో మహిళలకి ఆర్థిక సహాయం యిచ్చే పనులు కల్పించడానికి తీసుకొనిన చర్యలను విశదీకరిస్తూ, పల్లె ప్రాంతాలలో ప్రసూతి సదుపాయాలు కల్పించడానికి సదుపాయాలు సమ కూర్చపడ్డాయి. పల్లె స్త్రీలలో అక్షరాస్యత పెంపొందించే ప్రణాళిక అంత విజయం కాలేదని, అధికార అనధికార సభ్యుల సహకారంతో ప్రణాళిక విజయవంతం అవుతుందన్న ఆశ వున్నదనీ అన్నారామె.

శ్రీమతి సరోజినీ వరదప్పన్ సభికులకు వందన సమర్పణ చేశారు.

మధ్యాహ్నం ప్రోజెక్టు యింప్లిమెంటింగు కమిటీ వారి సూచనలకు సమాధానాలు యిచ్చారు.

మూడవ రోజు ఉదయం శ్రీ భక్తవత్సలంగారి ఆధ్వర్యం క్రింద సమావేశం జరిగింది. ఆఫ్టర్ కేర్ కార్యక్రమాల సమీక్ష జరిగింది. శ్రీ భక్తవత్సలం గారు, ఆలిండియా మొత్తంమీద కార్యక్రమాల నిర్వహణ పద్ధతి సుసాధ్యంగా వుందని, కాని కష్టతరంగా వుండ కూడదన్నారు. అంతేకాదు స్వచ్ఛంద సేవా సంస్థలే సంక్షేమ కార్యక్రమాలని విజయవంతంగా

నిర్వహించ కలవని అన్నారు శ్రీ భక్తవత్సలంగారు.

శ్రీమతి దేశ్‌ముఖ్ ప్రసంగించుతూ కేంద్ర సంస్థ- ఆఫ్టర్ కేర్, హైజీన్, సోషల్ డిఫెన్సు కార్యక్రమాలను విశదీకరించారు. అనవసరంగా జరుగుతున్న కాలయాపన వల్ల కార్యక్రమాలు సరిగా నిర్వహింపబడ్డం లేదనీ, దానికి కారకులైన వారినీ అదుపులో పెట్టాలనీ అన్నారు. ఆఫ్టర్ - కేర్ గృహాలలో విద్యా సౌకర్యాలు కల్పించడానికి గాను 25 లక్షలు సమకూర్చబడిందని చెప్పారు శ్రీమతి దేశ్‌ముఖ్. శ్రీమతి వి. టి. లక్ష్మి వివిధ గృహాల అభివృద్ధిని గురించిన రిపోర్టు చదివారు. తరువాత, వివిధ రాష్ట్ర కార్యక్రమాలు చర్చింపబడ్డాయి. శ్రీమతి ధన్వంతీరామారావు వందన సమర్పణ చేస్తూ. మద్రాసు రాష్ట్రం సంక్షేమ కార్యక్రమాల విషయంలో ముందంజ వేసిందన్నారు. మధ్యాహ్నం సమావేశానికి వివిధ ప్రాంతాల నుండి వచ్చిన ప్రతినిధులు మద్రాసులోని వివిధ సంస్థలను చూచారు. నాల్గవ రోజున ప్రతినిధులందరూ మహాబలిపురం వినోద యాత్ర వెళ్ళారు.

దేశం మొత్తంమీద సంక్షేమ సంస్థ జరుపుతున్న వివిధ కార్యక్రమాల సమీక్ష యీ సమావేశం వల్ల మద్రాసు ప్రజలకీ దేశం మొత్తంమీద అందరికీ విశదం అయింది. ఇలాగే వివిధ కేంద్రాలలో యిటువంటి సమావేశాలు జరిపించుతూ వుంటే బాగుంటుంది. ★





మణిపురీ మహిళలు

మణిపురి మహిళలు బుట్టలనిండా కుండల్ని తీసుకొని సంతకు వెళ్ళడం యీ దృశ్యంలో చూడవచ్చు.

మణిపూర్ గ్రామాల సంతల్లో ముఖ్యంగా స్త్రీలు చిన్ని చిన్ని బారులు తీర్చి కూర్చొని ప్రతి వస్తువులను అమ్మడమూ చూడదగిన దృశ్యము.

ఒక్క బేరమే కాదు మణిపూర్‌లో ప్రతి పనీ కూడా స్త్రీలే చేస్తారు. మణిపూరు మహిళల శరీర సౌష్ఠవం, నడక తీరు చూడముచ్చటగా వుంటుంది.




# తియ్యని బాధ-జీవన్మరణములు

అమ్మో, అబ్బో. దేవుడా నాకు వద్దురా దేవుడా—

ఒక్క క్షణము. కెవ్వుమని కేక — మందహాసము మరో క్షణము.

ఆడపిల్లయితే....

అత్తగారేమంటారో అన్న భయము, భర్త ఏమనుకుంటాడో అన్న సందేహము, కష్టపడ్డందుకు సరైన ఫలము దొరకలేదనే విచారము.

మొగపిల్లవాడయితే...

ముఖము చాటంత, కళ్ళలో ఆనందము నృత్యము చేస్తూ వుంటే, పెదాలమీద మందహాసము వీస్తూ హృదయములో సంతోషసాగరము వుబికి ప్రవహిస్తూ వుంటుంది. ఒక్క క్షణమునకు ముందుపడ్డ బాధంతా మరచిపోతుంది మాతృమూర్తి. ఆ బాధపడే క్షణములలో ఎంత భక్తి. ఎంత వైరాగ్యము కలిగింది. అంత పరిపూర్ణముగా, అంతహృదయ పూర్వకముగా ఇదివరలో దేవుడిని నమ్మలేదు. ఏదో పూజలు ప్రతి దినమూ చేస్తున్నా దేవుడువచ్చి రక్షించుతాడని పూజలు చేయుటలేదు. ఆదొక అలవాటుగా చేసేది. కాని ఆ క్షణములో ఆస్పత్రిలో ప్రసూతి వార్డులో "పుష్పంఫలము సమర్పయామి" లేకుండానేగాఢంగా దేవుడియందు భక్తి కుదిరి ఆపద్బాంధవుడు తననివచ్చి రక్షించుతాడని నమ్మి "రావే ఈశ్వరా! కావవే" యని పిలిచింది. బాధ తగ్గలేదు. ఆ కరుణామయుడు పల్కలేదు. ఆలవైకుంఠపురినుండి రానూలేదు, అందుచేత వెంటనే ఎమ్. ఎల్. ఏ. లవలే పద్ధతి మార్చివేసి వద్దురా బాబు అని వైరాగ్యములో మునిగిపోయింది. అంతేకాదు. బైట వరండాలో ముచ్చమటలు పోసి తోచకుండా పచారుచేస్తున్న ఆయ్యగారికి సైతము విద్యుశ్ఛక్తి ప్రవహించినట్లు తన వివిధ మానసిక పరిస్థితులను, అనుభూతులను కలుగచేసింది. భక్తి. వైరాగ్యము, ఆనందము ఈ కలగాపులగమే తియ్యనిబాధ.

అట్లాగే వృద్ధ తండ్రి లేక ఆప్తుడు మరణించినప్పుడున్నుంటుంది. శరీరము చల్లబడుతూ, నాడిఅడకుండా పోతూ వున్నప్పుడు, డాక్టరు పెదవి విరచి నప్పుడు మన ప్రాణము వలలో చిక్కిన పావురమువలే కొట్టుకుంటుంది, మన ప్రాణమే పోయేటట్లు వుంటుంది. కొండంత తండ్రి లేకుండా జీవించటము అసంభవమనిపిస్తుంది. తండ్రిలేని తల్లిని ఎట్లా ఓదార్చ గల్గమని దిగులు గలుగుతుంది. తండ్రి లేకుండా తాను అనాధనైపోతున్నానని దుఃఖము పొర్లిపొర్లి వచ్చి ముంచేస్తుంది. పెద్దలు తండ్రినితీసి క్రిందపెట్టి నప్పటినుండి శ్మశాన వాటికలో శరీరము పంచ భూతములలో కలసి పోయేవరకు దుఃఖము అతిశయించి వైరాగ్యములోకి పూర్తిగా ముంచుతుంది. ఎంతటి ఘనుడైనా ఎంతటి వానికైనా మరణము తప్పదు. జీవించేమి, బతికేమి, చావవలసిన వాళ్ళమేకదా - తొందరగా

అందరము చస్తే పీడా వదలిపోతుందని తోస్తుంది దాన్నే శ్మశాన వైరాగ్య మంటారు. కర్మచేసి. విల్లు నామాచూచి. ఇంటికి పెద్దయి జీవితము సాగించవలసి వచ్చినప్పుడు తండ్రికన్నా తానెంత చాతుర్యముతో వ్యవహారము నడుపగలనని గర్విస్తాడు. వృద్ధుడైన తండ్రి మరణము వలన నష్టమేమీ లేదని సమాధానపడతాడు. అభివృద్ధిపొంది అది చూచుటకు తండ్రి లేడేయని కించెత్తు విచారపడ్డా, స్వర్గాన్నుంచీ చూచి సంతోషించ గలడని ఆనందించుతాడు. అదీ జీవిత విధాన సరళి. భయము దుఃఖము ఆనందము ఇది చక్రములాగా తిరుగుతూ వుంటుంది. భయము దుఃఖము ఆనందము, కాబట్టిఆనందము తరువాత భయము దుఃఖానికి ముందుమెట్టు- అదీ తియ్యని బాధ అట్లాగే ఆనందానికి ముందుమెట్టు (ప్రసూతి విషయములో) తియ్యనిబాధ. ప్రసూతి వైరాగ్యము, శ్మశాన వైరాగ్యము హాస్యాస్పదమైనవి. తియ్యని బాధలో మనము మన నిజస్థితిని మరచే అవకాశమున్నది. నిజస్థితిమరచి ఏవో అభిప్రాయాలు ఏర్పరుచుకొని క్షణంలో మళ్ళీ వాటిని మార్చుకుంటే హాస్యాస్పదులు కారా?

సుధీర్ఘంగా ఆలోచిస్తే జీవితము అంతా తియ్యని బాధ యని తోచక మానదు. ప్రస్తుతము భారతీయులకందరికీ ఈ తియ్యని బాధ తప్పదు. నవభారత నిర్మాణము ఒక సుధీర్ఘమైన తియ్యని బాధ. ముందు దేశము శశ్యస్యామల మవుతున్నదనే ఆశ అనారోగ్యము, ఈతిబాధలు నిర్మూలమై ఆరోగ్యము, అభివృద్ధి నిర్మిస్తున్నామనే తృప్తి, భూతల స్వర్గము చేయగలమనే నమ్మకము, ఇప్పుడు పడుతున్న అప్పుల బాధ, పన్నులబాధ, అన్యాయము, అనారోగ్యము, తిండి కరువుని నీటి కరువు, విద్యావైద్య లోటుపాట్లు తియ్యవేబాధగా మారుస్తుంది. క్రొత్త సంవత్సరము రోజు వేపపువ్వు తింటాము— అది తియ్య తియ్యగా, పుల్ల పుల్లగా చేదుగా, వగరుగా, ఎంతో బాగుంటుంది. పండుగకు చేసుకున్న బొప్పట్లు పరవాన్న మంత బాగుండక పోవచ్చును. వుదయమే పండుగనాడు వేపపువ్వుతిన్నప్పుడు ఇల్లు అలుకంగానే పండుగైందా ఇంకా అది చెయ్యాలి, ఇది చెయ్యాలి అని జ్ఞాపకము వస్తుంది. అట్లాగే విద్యా సౌకర్యాలు వైద్య సౌకర్యాలు సరిగా అమరనప్పుడు ఇంకా నవభారత నిర్మాణములో మిగిలిపోయిన ముఖ్య విషయములు స్ఫురణకు వచ్చును. ఆహార సమస్య, జనాభా సమస్య. భూసంస్కరణల సమస్య వగైరా సమస్యలన్నీ పరిష్కారను చేసుకునేటప్పటికి బాధ తియ్యనౌతుంది. ఆ తియ్యని బాధ చప్పరించి "హా! ఎంత. తియ్యగా వుంది!" అని అనుకునేటప్పటికి మళ్ళీ ఏదో వగరుగా నాలుకకు తగులుతుంది. ఏదో చిక్కులు కష్టాలు, బాధలు, మళ్లీ ఆరంభము, వాటిని పరిష్కరించుకునే సమస్యలో పడిపోతాము. అదే జీవితము. నిరంతర సమస్యా పరిష్కారము—తదనంతర ఆశాభావము— ఆనందము దుఃఖము లైటుహౌసు అనుసరించి జీవిత యాత్ర ప్రయాణము సాగిపోతుంది. జగన్నాటకుడు సృష్టించిన పిక్‌నిక్ స్థలము ఈ లోకము. మనమంతా పిక్‌నిక్ చేస్తున్న వాళ్లమే. మనము ఇతరులకు కష్టము లేకుండా, ఇబ్బంది లేకుండా, సువిశాలమైన సృష్టిలో తియ్యని బాధలు అనుభవిస్తూ ఈపిక్‌నిక్ వీలైనంత హాయిగా, సక్రమముగా జరుపుకోగలము కదా. ★



# దేశభక్తి

కథానిక

అంధకార మెల్లెడల వ్యాపించి యుండెను. ఆకాశమున నక్షత్రములు మినుకుమినుకు మనుచుండెను చూపరులకు భీతిగొల్పు నిశాకన్య నీల వసనాచ్ఛాదితయై తన సహజ సౌందర్యముతో చరించుచుండెను. అచ్చట కీచురాళ్ళ ధ్వనితప్ప ప్రకృతియంతయు నిశ్శబ్దముగ నుండెను. అట్టి మహారణ్యమున పెద్ద పెద్ద దేవదారు, పనస మున్నగు వృక్షరాజములును, మల్లె మొల్ల, మొదలగు లతలును. పొదలును నిండియుండెను అట్టి వాని మధ్యమున నొక పొదరింటిలో యిరువురు వ్యక్తులు మినుకు మినుకు మను దీపపు కాంతిలో కూర్చుని యుండిరి. వారికి నిద్రయు మాటయు లేదు. అట్టి నిర్జనారణ్యమున వ్యథ మనస్కులై వారేలయుండిరో? వారిరువురు అన్యోన్యానురాగముగల దంపతులై యుండిరి. అత్యంత భయాకులితయై సాశ్రునయనములతో బెదరి బెదరి చూచుచు భార్య భర్తతో;

"నాథా! నేనీ నిర్జనారణ్యమున నీ విరహవేదనకు తాళజాలను. మీరు వెళ్లెదనని చెప్పుటతోడనే నా ప్రాణము లెగిరి పోవుచున్నవి. అబలను నన్ను విడచి పోవుట న్యాయమేనా? ఎన్ని కష్టములకైనను ఓర్తునుకాని, మీ యెడబాటును మాత్రము సహింపజాలను. నన్నుగూడ మీవెంట తోడ్కొని పొండు."

ఆ దీనాలాపయగు ప్రాణేశ్వరికి ముఖవిలాసమునకును, ఆ చంద్రముఖియొక్క కౌముదీ వికాసమునకును ముగ్ధుడై అతడిట్లనెను. "ప్రాణేశ్వరీ! నిన్ను విడచి నిముషమైనా తాళజాలను. నిన్నెల్లప్పుడు నా హృదయమున ప్రేమించుచుందును. నీవు భయపడవద్దు. నేను అత్యావసరమైన కార్యము వలన వెళ్ళకతప్పదు. కదన రంగమున పురుషులు స్త్రీలతో నుండుటకష్టతరము. ఎవని విలాసమున నా విభవ మంతరించెనో ఎవని దుర్నయము వలన ప్రజలు అన్న పానాదులు లేక కృశించుచున్నారో ఎవని కఠినశాసనముల వలన స్వర్గతుల్యమగు మాతృభూమి అపవిత్రమయ్యెనో అట్టివాని వినాశము త్వరలోనే రానున్నది. స్వదేశాభిమానులగు మహనీయులు, యీద్వేషమును తెలిసికొని, దుష్టశిక్షణ చేయగలరు. భూమిపై మానవజన్మమెత్తి నందులకు దేశసేవ చేయుటయే ముఖ్యము. నా బొందిలో ప్రాణమున్నంతవరకు నేను శత్రు వినాశమునకై పాటుపడెదను. నా దేహమును దేశసేవకై అంకిత మొనర్చెదను, అదిగో! శత్రు వినాశమునకై రణభేరి మ్రోగుచున్నది. నీవు మన దేశముయొక్క విజయ ప్రకాశమును త్వరలోనే చూచెదవుగాక. విజయా! నీ సౌందర్యము జిమ్ము కటాక్షములతో సెలవిమ్ము, శత్రు విచ్ఛేదముగావించి, తిరిగివచ్చి నిన్ను ప్రేమడోలికలలో నూగులాడించెదను."

అంతట విజయ "మనోనాయకా! ప్రేమించుజనులను ఆదరముగను, ద్వేషించు వారిని విషతుల్యముగను జూచుచు శత్రువులను నీ కృపాణమున కెరచేయుట ఉచితమగునా? సర్వజనులను ఒకే విధముగా పరిగణించి ఘోరమగు ద్వేషమును హతమార్చరాదా? లేదేని విషప్రయోగము వలన శత్రునాశన మొనర్పరాదా?" అనెను.

శ్రీమతి బి. రమాదేవి

యువకుడది విని నవ్వుచూ యిట్లనెను. "ప్రియా! కుటిలోపాయముచే శత్రు సంహారమునకు గడగుట మిక్కిలి హేయము. అట్టి అనుచిత కార్యము వీర పురుషులకు కీర్తిప్రదము కాజాలదు. ఖడ్గహస్తుడై రణ రంగమున శత్రువుల నెదుర్కొన్నవారే నిజమైన వీరుడు."

అదివిని లజ్జావనత వదనయై యిట్లనెను. "ప్రియా అట్లుకానిచో నన్ను మీవెంట గొనిపొండు. మీరెక్కడ కేగినను మీ వెంటవచ్చి, మీ పాదసేవ జేసెదను. అట్లు మీరు తీసికొని వెళ్ళనియెడల వియోగ భరమునకు తాళజాలక, విషముత్రాగి, మిమ్ము స్మరించుచు నా ప్రాణములు విడుతును."

ఇదివిని యువకుడిట్లనెను. "ప్రియా ! నీ మాటలు వినజాలకున్నాను. నాతోరమ్ము; యీ స్త్రీ వేషము విడిచి పురుషరూపము ధరింపుము. పురుషానుకూలమైన ధైర్యము నవలంభింపుము. అబలననియు, సుకుమారిననియు, నిప్పట్టున మరచిపొమ్ము. పరహస్తగతయగు మాతృభూమి నుద్ధరించుటకు వెడలుము. నేను మాత్రము పురుషుడనై జన్మించి నిజకర్తవ్యము నెట్లు మరతును?"

పతిమాటలు వివినంతనే చంద్రదర్శనమైన చకోరమువలె కడు సంతసించుచు, లేచి పురుషోచితదుస్తులను ధరించెను. తననెవరు స్త్రీయని గుర్తించలేరని చిరునగవుతో మందగమనయై, పతికడ కరుదెంచెను. భర్త మందహాసము నిట్లనెను. ప్రియా ! నీ నూతన పురుష వేషముగాంచి ముగ్ధుడనైతిని. నీ భేద రూపమును గుర్తించు వారెవరు? ఈ వన దృశ్యమును ఒక్కసారి ధ్యానించుము, ఇట్టి రమణీయ ప్రదేశమును విడిచిపోవుట కష్టతరముగా నున్నది సుమా మరల ఎప్పుడు యిచటికి రాగలమో గదా !"

ఇది విని అశ్రునయనయై విజయయిట్లనెను. "ఇంత కంటె సుఖప్రదమగు తావీ ప్రపంచములో లేదనుట అతిశయోక్తికాదు. ఈ ప్రపంచమంతయు ద్వేషభూయిష్టమైనది. ఈ వన సఖులకంటె మించినవారీ ప్రపంచములో లేరని తలంచుచుంటిని. నాథా! మీ యాజ్ఞవలననేకదా ! నేనును బయలు దేరుచున్నాను"

అంతట నతడు చిరపరిచితములగు వృక్షవాటికలు, పక్షులు కురంగములు మున్నగు వాటితో శెలవు తీసికొని విజయతో నడువ నారంభించెను. వారు వన మధ్యమున నడచిపోవు చుండిరి. వనమును వారివెంట లాగికొని పోవుచుండిరా యనునట్లుండెను.

అంతట రాత్రి గడచెను. ఉషఃకాంతులు నలుదిశల ప్రాకెను. ప్రాతఃకాలపు సూర్యుని లేయెండలో వారు నడచిపోవు చుండిరి. అట్లు పోయి పోయి వారు మధ్యాహ్నమున కొక నదియొద్దునజేరిరి. అచ్చట కాలకృత్యములు తీర్చుకొని, కొంతసేపు విశ్రమించి మరల బయలుదేరి నదిని దాటుట కాలోచించుచు, నిటునటు జూచుచుండిరి. అదృష్టవశాత్తు వారికచట, నొక పడవ కన్పట్టెను. వెంటనే వారమితానందముతో దానినధిరోహించిరి. వారు మనమున త్వరలో నావలి గట్టుజేరుదుమని సంతసించు చుండిరే కాని, ముందు రాబోవు విపత్తును గుర్తించలేక పోయిరి.

నావ నదీగర్భమున జేరెనోలేదోకాని, ఉన్నట్టుండి శ్యామల వర్ణముగల కృష్ణానది, భయంకరమగు కెరటములతో నల్లకల్లోలము కాజొచ్చెను. మన దంపతులు నదీగర్భ సౌందర్యమును వీక్షించుచు నానందమున మైమరచి యుండిరి. ఉన్నట్టుండి సమయమున నెక్కడనుండియో పెనుతుపాను సాగెను. పడవ అల్లకల్లోలము కాజొచ్చెను. క్షణములో నావ మునిగిపోవునట్లుండెను. అప్పటి ప్రకృతి భయానక దృశ్యమును జూచి యువకుడిట్లనెను.

"ప్రాణేశ్వరీ ! ఈ క్షణ భంగురమగు శరీరమును యిప్పుడే విడచెదను. దేహత్యాగమనిన నాకావంతయు విచారములేదు. కాని నామనోభీష్టము పూర్తి కానందుకే కడువిచారముగ నున్నది. ఈ శరీరముతో దేశసేవ జేయలేక పోయితినికదా ! ప్రియా ! రమ్ము కడసారి బాహువులనిండ కౌగలించు కొందును, అఖండజలరాసిలో తిరిగి బ్రతుకు నాశయులేదు."

ఇదివిని విజయ యిటులనెను. "నాథా ! ఉత్తజన్మ యందును, మనమిరువురము కలసియే యుందము. విచారింపకుడని నవ్వుచు బలికెను. వారిరువురు కరములచేత నాలింగనము గావించుకొని పరమానంద భరితులై యుండిరి. శాంత భూషితులును, శోకరహితులునునగు నా దంపతులతో, నావ క్షణములో నొక కెరటము, తాకుడునకు జలగర్భమున మునిగి లీనమాయెను.

వర్షము వెలిసెను. ప్రకృతి యంతయు తన సహజ తేజమును వెదజల్లు చుండెను.సాయంకాలపు సూర్యుని

బంగరు కిరణములలో ప్రకృతియంతయు రమణీయముగా నుండెను. ఉణము క్రింద నత్యంత ప్రేమానుకూలురగు. నిరువురు దంపతులుండిరికదా! వారెటుపోయిరో ఏమయిరో గదా! అంతా భగవంతుని మాయ.

♦ ♦ ♦

తూర్పు దిక్కున సూర్య బింబము తన కిరణముల ద్వారా చీకటి తొలగించుచుండెను. అప్పటి ప్రాతఃకాలపు సౌందర్యము వర్ణాతీతముగ నుండెను. అట్టి ప్రాతఃకాల రమణీయమును వీక్షించుచు, నొక తపోధనుడు అనదీతీరమున నిటునటు తిరుగుచు నది లోనికి జూచెను. ఆ యఖండజల రాశిలోనొక శవము గాన్పించెను. ఆ ముని వెంటనే నదిలోనికి దిగి శవమును వెలికీడ్చి, పరికించి చూడ ప్రాణమున్నట్లు తోచెను.

అది పురుష వేషము ధరించిన స్త్రీయై యుండ, నాముని సంతోషమున, నా శరీరమును, తన కుటీరమునకు గొనిపోయి ఉపచరింప సాగెను. కొంత సేపటికి, చైతన్యము కలిగి లేచి కూర్చొని, అపరిచిత స్థలమున నుండుట గాంచి చకితయై, మునికి ప్రణామము గావించెను. పురుష వేషము స్మృతికి రాగా, గుండె బాదుకొని ఏడ్చుచూ, "నాప్రాణేశ్వరు డెక్కడ? ఓ ముని శ్రేష్టుడా! తెల్పుము. మేమిరువురము ఒకే పరిజలములో లీనమైతిమి. అశ్రువులు జలజల కార్చెను, మరియు నా పతిని విడిచి నిముషమైన తాళజాలను. నన్ను నా పతికడకు జేర్చుడు" అని విలపించెను, తపోధ నుడగుట వలన సంగతంతయు ముందే తెలిసికొనెను. ముని యువతి స్నేహ భావమున "పుత్రీ! దుఃఖింపవలదు. నీపతిని వెదకి తెచ్చెదను, నేను వచ్చు వరకు నీవీ కుటీరములో సుఖముగా నుండుము. నీకేమియు భయములేదు. నేను వచ్చువరకు నీవీ కుటీరములో సుఖముగా నుండుము." అని పరహితరతుడగునా ముని నది యొడ్డున వెదక నారంభించెను. అట్లు ఎంత వెదకినను ఏశవము గాన్పింపలేదు. నదీ ప్రవాహము వెంట వెదకుచూ నా ముని వెడలి పోయెను.

వియోగ దవానలమునకు తాళజాలక, విజయ కుటీరమున నుండుట కిచ్చగింపక, వెలికి వచ్చెను. నలు మూలల పరికించెను, అచ్చటి ప్రకృతి దృశ్యము కడు రమణీయముగా నుండెను, కాని ప్రియ విరహితయగు విజయకు నది కంటక ప్రాయముగ నుండెను. ప్రేమ యనునది పవిత్ర వస్తువు. దీనికి జాగ్రాన్నిద్రావస్థలు రెండు సుఖముముగానే దోచును. ప్రేమ విరహ వియోగభర దుఃఖమునకు విజయ పదములు తొట్రుపడ నదీ తీరమున కేగెను, అప్పటికి సరిగా రెండు ఝాములయ్యెను. సూర్యుఁడు నభోమధ్యమున తన ప్రచండమగు వేడి కిరణములు వెదజల్లుచుండెను. మన విజయ గంభీరమగు జలరాశిని జూచి, రోషమున తిట్ట నారంభించెను. "హా ప్రాణేశ్వరా! స్వదేశ సేవా ధురంధరా! సద్గుణ పుంజమా! నేనింక నిన్ను చూడజాలను గాబోలు. ప్రాణనాధా, ప్రియా! ఎచ్చట నుంటివ"ని అరచుచు, ఆ మహారణ్యమంతయు తిరుగుచూ, కేకలిడుచూ, ముండ్లపై పడుచూ, లేచుచు, నొకచెట్టు క్రిందవేసారి కూర్చుండెను. ఇంతలో నచ్చట మనుష్య ధ్వని విని పించినంతనే, లేచి పరుగిడ జొచ్చెను. కొంత వడికి నడవ జాలక, నొక చెట్టుకడ కూర్చుండిట్లా లోచించ సాగెను. "నేనెంత శ్రమ పడినను నాప్రియుడు లభింపడు. ఆయన దేశ సేవ చేయవలెననే కోరికతోనే మృతి నొందెను, కాన అట్టి కోరికను నిర్వర్తించి నేను ధన్య నగుదును" నని ధృఢ మనస్సుతో లేచి కొంత దూ రముబోవ నొక దారి కన్పించెను.

♦ ♦ ♦

ముని కొంత దూరము వెళ్ళగా నదిలో నొక పురుష శరీరము గాన్పించెను– ముని అత్యాతురమున దానిని ఒడ్డునకు జేర్చి, కొంత చైతన్య మొదలినట్లు గాన్పించగానే తన కుటీరమునకు జేర్చెను.అచ్చట విజయను కానక ముని విస్మితుడై. వనియు నంతయు వెదకెనే కాని, ఎచ్చటనూ కానరాలేదు. తిరిగివచ్చి యువకుని శరీరమునకు వేడి తగులుటకై మంట వేసెను. కొంత వడికి యువకుడు స్వప్నమువలె కలువరింప సాగెను. "ప్రియా! విజయా! దేశోద్ధరణకై నాతో బయలుదేరితివి. నిన్ను బోలు సహాయులు నాకింకెవరు గలరు? ఎంతలో మాయమైతివి" అనుచుండ ముని పరమా నందమున తనకు దేశ భక్తుడు. లభించెనని, పరమేశ్వరునికి ధన్యవాదము లర్పించెను. కొంత వడికి యువకుడు లేచి కూర్చొని మునికి ధన్యవాదము లర్పించెను. ముని సంతసించుచూ "కుమారా! నీవు జలములో కొట్టుకొని పోవుచుండ పట్టితెచ్చితిని. నీవె

వరి పుత్రుడవో తెల్పుము" అన యువకుడిట్లనెను, నా చరిత్రము చాలా ఉన్నది. అయినను మీ యాజ్ఞను సారముకర్తవ్యముగా తెల్పెదను. మాది "మిలను" పట్టణము— నా తల్లి బాల్యముననే గతించెను— తండ్రి దేశమున జరుగు అత్యాచారము వలన హాహాకారమిడు జనులకు సహాయమొనర్చిన నేరమునకు రాజ కర్మచారులు శిక్షించిన విధిచాలదని పెద్ద న్యాయాధికారి కఠినమగు శిక్షను విధించెను. అంతట నన్ను వెంటనిడుకొని, పోయి తన మిత్రుడగు నొక ఋషి కప్పగించి వెడలిపోయేను. ఋషి వద్దనే పెరిగితిని. అతని వద్ద నా కంటె చిన్నది యగు బాలిక కలదు. మేమిరువురము అత్యంతమైత్రి కల్గివుంటిమి. తగు సమయమున మా యిరువురికి వివాహము గావించి, దేశ సేవా యుక్తులు గమ్మని ఆశీర్వదించి ముని పరమపదమలంకరించెను. ముని యాజ్ఞానుసారము దేశసేవ చేయుట కమితానందముతో మేమిరువురము బయలుదేరి మధ్య త్రోవలో నా ప్రియవదనమగు విజయను గోల్పోయితిని. ఈ నదిలో తమకేదేని శవము గాన్పించిన నావ తీయుండని కన్నులశ్రుపూరితములు కాగ బల్కెను. ముని విజయ సంగతి చెప్పక కుమారా! నీవు దేశభక్తుడవు గాన, నే చెప్పినట్లు చేయుము. దేసమునందత్యాచారములు ప్రబలి దరిద్రదేవత విలయతాండవ మాడుచున్నది, కాన నీవు నేడే బయలుదేరి దేశము నుద్ధరించుటకై ప్రయత్నించుము. పుత్రా! నీకు మంగళదాయకమగు మార్గమున జనుము. అవసర మగుచో నీకు నేను సహాయమొనర్తును. పొమ్మని" బల్కెను.

విజయయు నట్లు పిచ్చిదానివలె పోను పోను నొక గ్రామము కాన్పించెను. అచ్చట ప్రాతఃకాలమున కూడ నా గ్రామమంతయు వ్యాకులముతో నున్నట్లుండెను. అది చలికాలము. ఒక గృహములో భయంకరమగు చలిబాధకు తాళలేక, వస్త్ర విహీనుడైన ఒక మానవుడు ఎండలో కూర్చొని వుండుట, విజయ గాంచెను. ఆతనిభార్యా. బిడ్డలు అన్నములేక కృశించి అచ్చటనే చింకిచాపలపై పరుండియుండిరి. విజయ వారికెదురుగా కూర్చొని, వారి దీనస్థితికి విచారించుచుండెను. అదిగాంచి ఆ మానవుడు వెంటనేలోనికేగి ఒక చింకిచాప తెచ్చి ఆమెకిచ్చి, కొంత గడ్డినితెచ్చి నిప్పురాజేసి, ఆమెను చలికాచుకొన ప్రార్థించెను. వాని త్యాగమున కచ్చెరువంది విజయ "అన్నా! నీ నా పూర్వపుణ్య వశము వలన నీవంటి సాధ్విని గాంచ గల్గితిని. రాజు భృత్యులు నన్నొక మిథ్యాపరాధమునకు సాక్ష్య మిమ్మనిరి. నే నసత్యమాడనని స్పష్టముగా చెప్పినందులకు నా యావదాస్థియు భూమిని లాగికొని తినుట కన్నములేకుండ జేసిరని" చెప్పెను.

అంతట విజయ అహా! మాతృదేశమున కెంతదురవస్థ కల్గినది. ఇట్టివారికి సేవజేసి సుఖమొనగూర్పవలెననియేకదా నాపతి కోరినది. నేనిప్పుడే బయలుదేరి స్వదేశము నుద్ధరింతునని, సన్యాసివేషమున బయలుదేరి, యిల్లిల్లు, ప్రతి గ్రామము తిరుగుచు దేశభక్తితో నిండిన గీతములు బాడుచు, ప్రజలకు వీరరసమొల్కునట్టి, వచనములు బోధించుచు దేశ రక్షణ కొరకై సైన్యము గూర్పసాగెను.

యువకుడును యిదేవిధముగా కొన్ని గ్రామములలో సైన్యమును తయారు చేసెను. ముని గూడా మిలను పట్టణ సమీపములో ఉపన్యాసము లీయదొడగెను. విజాతీయులిది పట్టజాలక యీ ముప్వురినాయకులను బాధింపదొడిగిరి. కాని ప్రజలు సింహగర్జనము చేసి యుద్ధమునకై బయలు వెడలిరి.

మన యువకుని సైన్యము కొలదిగనున్నను. వైరిబలమెక్కువైనను లెక్కింపక, ప్రాణముల కాశింపక శత్రువులను దునుమాడుచుండెను. ఒకవైపునుండి లెక్కకు మించిన యోధులను వెంటనిడుకొని వచ్చి ముని సహాయ మొనర్పసాగెను. రెండవవైపు నుండి విజయ అసంఖ్యాకులగు వీరులతో భైరవీ నినాదములతో వచ్చి కలిసెను.

అప్పుడు ముని ప్రసన్నవదనముతో "కుమారా! ఇప్పటికి నీ తండ్రి కోర్కెను చెల్లించి ధన్యుడవైతిని. నిన్ను కఠినముగ అడవుల యందు విడిచి, దేశము నుద్ధరింప యత్నమొనర్చిననేనే నీ తండ్రిని, నీతో సమానయశస్విని యగు యీమె నీ భార్య విజయ. నీవు దొరికిన నాడే యీమెకూడ నాకు దొరికినది. నేను నిన్ను వెదుకుటకుబోవుచు, యీమెను నా కుటీరమున నుండ నియమించగా వేటకు బోయినదో ఎంత వెదికినను కానరాలేదు. సత్యమగు ప్రేమ ఎన్నటికి నిష్ఫలము కాజాలదు. పూజ్యురాలును సద్గుణవతి యునగు విజయతో కలసి కీర్తి నార్జింపుము. మిమ్ము గాంచి నేటికి నాజన్మ సార్ధకమైనది. ఇంక దేహత్యాగమొనర్చెదను. పుత్రా శెలవు" అనెను.

జయధ్వనులు చెలరేగుచుండ ముని ప్రాణములు

# బలపడిన బంధుత్వం

"జలజా! కట్టుకుని చాలారోజులైంది కదూ! విశేషాలేమైనా వున్నాయా?" పై పట్నంవెళ్ళి వచ్చిన వెంటనే స్నేహితురాలిని చేరి సుజాత అంది.

"చాలా వున్నాయ్ సుజాతా! ఎందుకులే అవన్నీ ఏకరువు పెట్టి నిన్ను విసిగించడం" నిరుత్సాహంగా అంది జలజ.

"కొత్తగా మాట్లాడు తున్నట్టుందే; నన్ను విసిగించేదేదో అదే ముందు చెబుదూ" బలవంతం చేసింది.

"నన్నుమరి నాన్నగారు చదివించలేరని చెప్పారు"

"అయ్యో! అలాగా! ఏంచేయమన్నారు?"

"ఏ అయ్య చేతిలోనైనా పెట్టాలని విశ్వప్రయత్నాలు చేస్తున్నారు."

"ఏమిటీ! వివాహమే! బాగుందిలే—పోనీ ఏదైనా సంబంధం కుదిర్చారా?"

"అదే జరగలేదింతవరకూ. నాన్నగారు కాళ్ళరిగిపోయేలా తిరిగినా లాభంలేక పోయింది. నా చదువు మూలంగా స్థితిగతులెలా దిగజారి పోయేయో నీకు తెలుసుగా! వేలు కుమ్మరిస్తేనేగాని సంబంధం దొరకని యీరోజుల్లో అంత డబ్బెలా వస్తుంది?"

"ఇంతకీ మీనాన్నగారేమంటారు?" ఏమంటారో తెలిసికూడా అడిగింది సుజాత.

"ఏమనగలరు.... అన్నిటికీ కాలం. కర్మం కలిసి రావాలంటారు. ఉద్యోగానికి దరఖాస్తు పెట్టమన్నారు అదే శరణ్యమైనట్టు. స్త్రీకి చదువు ముఖ్యమైనా అది జీవితానికుపయోగ పడేంతగా వుంటే ఈ సమస్యలే రాకపోయేవిగా. అవునుగాని యింతవరకు చదివి ఏం వెలగబెట్టినట్టు?" సంశయం తెలియ చేసింది చివరకు.

"ముందు ముందీ చదువు విలువ తెలుస్తుంది జలజా! నీకు అందమూ, గుణాలూ, చదువూ వున్నాయి కాబట్టి సంపదలేక పోయినా ఏనాటికైనా నీ జీవితం నువ్వు సరిదిద్దుకోగలుతావు. మరి అందంగాని, గుణం, సంపద, ఇవేవీ లేనివారికి చదువే జీవనాధారమవుతుందని తెల్సుకోలేక పోతున్నావ్. ఒకరిమీద ఆధారపడ నీయకుండా సహకరిస్తుందీ చదువే."

కధానిక

"మనం ఉద్యోగాలకెగబాకితే మన పాట్లు కుక్కలు కూడా పడవని నా అనుమానం. నల్గురి కళ్ళల్లో పడి నానా అగచాట్లకూ గురికావలసి వస్తుందని నా భయం."

"వెర్రి జలజా! ఇంకా పాతకాలంలోనే నిద్రిస్తున్నావా! అనుమానాలూ, భయాలు పెట్టుకుంటే నీ లాంటివారు ముందుకు పోలేరుసుమా! మనప్రవర్తన బాగుంటే ఒకరు మనల్నేమీ చేయలేరు."

"ఇంతకీ నన్నేం చేయమంటావ్?"

"తగిన సంబంధంవస్తే పెళ్ళి చేసుకుని భర్తతో సహకరించి తండ్రి మనోవ్యాధిని పోగొట్టమంటాను"

శ్రీ మంద రామారావు

"అది అసాధ్యం సుజాతా ! నా పెళ్ళి నాన్న బ్రతికుండగా చూడలేరేమో !"

"ఎరికివై పోతున్నావ్ జలజా ! అన్నీ సానుకూల పడతాయ్ ఇప్పట్లో అసాధ్యమే అయినా కొంతకాలానికి మన ప్రయత్నాలు ఫలిస్తాయ్. మహా మహా వాళ్ళే ఈ పెళ్ళిళ్ళ సమస్యలతో సతమత మౌతున్నారు మరి !" మనసులో ఏదో ఊహించుకుని "వస్తాను జలజా" అనిచెప్పి తిన్నగా స్వగృహం చేరుకుంది.

సుజాత యింటికి వచ్చినా మనసు మనసులోలేదు. జలజ గురించి అనేకంగా ఆలోచనలు వస్తున్నాయ్ పోతున్నాయ్. జలజ తనకు ఆత్మీయురాలు. సహాధ్యాయిని. ఆమె అంటె తనకు ప్రాణం. జలజకు ఏ కష్టం వచ్చినా సహించలేదు. ఇప్పటి జలజ పరిస్థితి తల్చుకుని విచారిస్తూంది. "నాకూ జలజకూ ఏమిటి సంబంధం. నేను ధనవంతుల బిడ్డను. అందమున్నా లేక పోయినా కురూపిని మాత్రం కాను. చదువుకున్నాను సంపదంతా అనుభవించడానికి నేనే వారసురాలను. నాలో ఏలోటున్నా నాకున్న ధనం కప్పేస్తుంది. మరి జలజ గతేంకాను? పాపం ఆతల్లిలేని పిల్ల కోరిక తీర్చడానికి సమస్తమూ తెగనమ్మి పల్లెనుంచి పట్నం వచ్చి కాపురంపెట్టి చదువు చెప్పించాడే తండ్రి. చదువుకు తెలివీ, తెలివికి అందం, అందానికి గుణాలూ తోడయి వన్నెలు దిద్దాయే ! ఇన్నీవుండీ ఎన్నిచిక్కులకు లోను కావలసి వస్తోంది ! ధనలేమివల్ల కట్న పిశాచానికి గురికావలిసిందేనా !" ఆరాత్రి ఆలోచించి ఒకనిర్ణయానికి వచ్చేసింది. మనసు కొంచెం చులకన పడగానే ఎప్పుడో నిద్ర పట్టేసింది,

♦ ♦ ♦

సుజాత తండ్రి మదరాసులో ఏదో సంబంధం చూసొచ్చాడు. ఆరోజే చూపుల కోసరం వస్తున్నారని సుజాతకు తల్లీ, తండ్రీ చెప్పారు. అందుకే ఆయింట్లో పెళ్ళి సందడిగావుంది. సుజాత అంతాగ్రహించి జలజ గృహం చేరుకుని?"

"జలజా ! ఇవాళ నన్నెవరో చూడ్డానికి వస్తారు. నువ్వుకూడా రావాలి అతన్ని చూడ్డానికి. అక్కడే యిద్దరం భోంచేద్దాం." అంది.

"నేనెందుకులే పానకంలో పుడకలా, చూసి చేసుకునేది నీవేగా"

"నీకు వచ్చితే నాకు నచ్చినట్లే జలజా ! ఊఁ.... వేగం తయారవు" తొందర పెట్టింది.

"నీకు పిచ్చిగాని పట్టిందేమిటి? నాకు నచ్చిందీ లేందీ నీకు చెప్తే నువ్వు మూడుముళ్ళూ వేయించుకుంటావా : ఇదెక్కడైనా వుందీ !"

"ఔను జలజా ! నీకు నచ్చితే నాకు నచ్చినట్లే. సామాన్య గృహంలో పుట్టిన నీభావాలు జీవితానికుపకరించేవిగా, సాధ్యపడేవిగా వుంటాయ్. మాకలా అనుకూలపడే ఉద్దేశాలుదయించవు. ఆశాసౌధాలు నిర్మించుకుని అందుకోసరం ధనం వెచ్చించి కృత్రిమంగా కల్పించుకోవడమే మాకు చేతనవుతుంది. మీభావాల కనుగుణంగా వర్తించి పదికాలాలపాటు మన డానికి దోహదంచేకూర్చు? అంతా విన్నాక కాదంటే బావుండదని, ఇందులో ఏదో నిగూఢం దాగివుందనీ తలచి 'సరే' తలూప వలసి వచ్చింది.

"తండ్రికి కావలసినవి అమర్చి సామాన్యంగానే తయారయి సుజాతతో బయల్దేరివెళ్ళింది జలజ. ప్రక్క ప్రక్కనే కూర్చుని స్నేహితురాండ్రిద్దరూ భోజనం చేసారు.

ఎండ చల్లబడింది. బంధువులు నల్గురూవస్తున్నారు. సందడి రానురాను ఎక్కువవుతూంది. సుజాత తండ్రి వెయ్యి కళ్ళతో మగపెళ్ళి వారికోసం ఎదురు చూస్తున్నాడు. కూతుర్ని ముస్తాబు కమ్మనిచెపుతూ, భార్యను కాఫీ. ఫలహారాలు తెమల్చుకుని వేగం రమ్మనీ, కుర్చీలూ-బల్లలూ సదరమని పనివాళ్ళనూ హెచ్చరిస్తూ పచారు చేస్తున్నాడు.

నాలుగున్నర అప్పుడే అవుతూంది, వీధిలో గుర్రబ్బండి ఆగింది. తండ్రీ- కొడుకూ- తూతురూ దిగారు. వర్జాలేమీలేని సమయం చూచి ఇంట్లో అడుగు పెట్టారు.

కుర్చీలో కూర్చున్నారు.

కాఫీ ఫలహారాలు వచ్చాయి.

అవుసరం లేదని చెప్పారు,

"కతికితే అతకదనా మీ అభిప్రాయం?" ఎదుటి వారి ప్రశ్న.

"ఏదైనా ఇప్పుడే స్టేషన్లో అన్నీ ముగించుకు వచ్చాం" జవాబు.

"సరేలెండి" సదురుబాటు.

లోపలి గదిలో "అదుగో వారు వచ్చారు. నా వెనకాలుండి నీపని నువ్వు చెయ్యాలి" అని సుజాత స్నేహితురాలిని ఆఖరుసారిగా హెచ్చరించింది.

తల్లివచ్చి సుజాతను తీసుక వెళ్ళింది. వారి ననుస రించింది జలజ,

పెళ్ళి కొడుకు యువతులపై చూపులు ప్రసరించాడు.

అదే సమయంలో జలజకూడా పెళ్ళి కుమారుని చూసింది.

ఇద్దరూ నిశ్చేష్టులయారు.

'చిన్ననాటి చెలి జలజ యిక్కడికెలా వచ్చింది!' శంకరం మైమరచి పోయాడు.

"నన్నేడిపించే శంకరం ఎంతవాడై పోయాడు!" అనుకుంది జలజ ఆనందాశ్చర్యాలు ముప్పిరి గొనగా.

"ఎంత అందకత్తెగా మారిపోయింది! పెళ్ళి కూతురు అలంకరించుకుని కల్పించుకున్న సోయగాన్ని సైతం పోటీ చేస్తూందే!" తను వచ్చిన పని మరచి చిన్ననాటి స్మృతులు మస్తిష్కంలో మెదలసాగాయి.

జలజ నిదానించి చూస్తూంది శంకరంవైపే.

ఒకరినొకరు చూపులతోనే ప్రశ్నించు కున్నారు.

జవాబులు కూడా చెప్పుకున్నారు ఆనందోద్వేగాలు పట్టలేక.

"ఆపిల్ల జలజకదండీ నాన్నగారూ?" ధృడపరుస్తూ మెల్లగా తండ్రితో అన్నాడు,

తండ్రి దీర్ఘంగా చూసి పసికట్టి "ఔనునాయనా" సూక్ష్మంగా అన్నాడు.

"ఎంత మారి పోయిందో! జలజ మీదనే మనసు లగ్నంచేసి అన్నాడు.

"ఆడపిల్లలంతే శంకరం" ఏదో ఆలోచిస్తూనే అన్నాడు.

తండ్రి ఆలోచనకు కారణం తెల్సుకోలేకపోయాడు కొడుకు.

తండ్రీ కొడుకుల మాటలర్థం కాలేదెవరికీ.

పెళ్ళిచూపుల ఫలితం యేమౌతుందోనని అందరూ ఎదురు చూడసాగారు.

సమాధానం వ్రాస్తామనిచెప్పి శలవుపుచ్చుకున్నారు మగ పెళ్ళివారు.

అందరూ ఆశ్చర్య పోయారు. పిల్ల నచ్చకపోతే అటువంటి సమాధానమే వస్తుందని అందరికీ తెల్సినా ఎవరిని నిందించి ఏంలాభం. అందరూ శంకరంనే చూస్తూ బొమ్మలా నిల్చున్న జలజవైపు 'నువ్వే వచ్చి యీ సంబంధం చెడగొట్టేవు' అన్నట్లు చూడసాగారు జలజకా సమయంలో ఆనందం, విచారం సరిగారెండు వైపులా తూగుతున్నాయి. అనుకోకుండా బలవంతం మీద తీసుకువచ్చిన సుజాతను మనసులోనే అభినందించుకుంది తనభావ దర్శనం చేయించి నందుకు. అయినా తనేదో పెద్దతప్పు చేసినట్లే తన మనసు పదే పదే చెపుతుండడం వల్ల బాధగా తల క్రిందకు దించి రెండడుగులు ముందుకు వేసిందో లేదో సుజాత లేచివచ్చి.

"జలజా! ఎందుకిలా మారిపోతున్నావ్? నీ కతను నచ్చారా?" ఆదుర్దాకొద్దీ అసలు విషయం గ్రహించ లేక అడిగింది.

జలజకేమి చెప్పాలో తోచలేదు. సమయం తనకు వ్యతిరిక్తంగా వుందని గ్రహించి కోపం వ్యక్తం చేస్తూ "సుజాతా! నా మీద కోపముంటే ఒంటిగా ఎక్కడో ఏడ్పించి కసి తీర్చుకోవాలి గాని యిలా.... పెద్దల సమక్షంలో........ "మరి పూర్తి చేయలేక పోయింది."

"ఇన్నాళ్ళూ సహవాసం చేసి నన్నిలా అర్థంచేసు కున్నావా!"

"నేనేం తప్పుగా అర్థం చేసుకోలేదు." ధైర్యం సడలిపోతున్నా కూడదీసుకుని అంది.

"కాక ఇప్పుడు నా ప్రవర్తనే బాగులేదనా నీ అభిప్రాయం- మొదట్లోనే అనుకున్నా నువ్వెన్నన్నా సహించాలని. నీ కోసం నేనేమైనా సహించ గల్గుతాను జలజా."

"నా కోసమా!" కల్పిపించుకున్న ధైర్యమంతా సడలి పోగా అభిమాన స్వరంలో అంది.

"అవును జలజా"

జలజ కంతా అవగతమైంది. స్నేహితురాలు కల్పించిన సదవకాశం మూలంగా తనలో అణగి పోయిన చిరుతప్రాయపు టూహాలు మళ్ళీ మొలకెత్తాయి. కోరిక ఫలించవచ్చునన్న ఆశలు కల్గుతున్నాయి. అంతవరకూ ఎంతో సహాయం చేసి ఆదుకున్న సుజాతను తప్పుగా అర్థం చేసుకున్నట్టు నటించి తను నొప్పించడం ఎంత పొరపాటు ! అసలు విషయం వెల్లడి చేస్తేనో; ఇది సమయం కాదేమో ! కొంచెం సేపు తటపటాయించి "సుజాతా ! నీమేలెన్నటికీ మరువలేను. ఏవేవో అని నిన్ను బాధించి నందుకు నన్ను క్షమించవూ !" ప్రార్థనా పూర్వకంగా అంది.

"నువ్వేం తప్పుచేసేవని క్షమించడం?"

"చేసాను సుజాతా ! నా చిన్ననాటి చెలికాడైన బావను చూపి, ఆశలు రేకెత్తించి పూల బాటను చూపబోతున్న నిన్ను తప్పుగా అర్థంచేసుకోవడం నేచేసిన తప్పు కాదూ?"

"ఎవరూ? శంకరం నీకు బావా !!!" ఆశ్చర్యంలో జలజను ఆపాదమస్తకం చూస్తూ అంది.

"అవును. నేనూ, శంకరం మేనత్త మేనమామ బిడ్డలం. ఒకే గ్రామంలోనే పుట్టాం. అక్కడే యిద్దరమూ చేయీ చేయీ కలిపి చిలిపి పనులుచేస్తూ, చదువుకుంటూ ఆనందంగా గడిపాం. స్నేహం వృద్ధి పొంది అభిమానించుకున్నాం. ఆ సమయంలోనే ఈడూ జోడూ సరిపోతుందని యిద్దరి గురించీ అమ్మా నాన్నా అనుకుని మురిసిపోయే వారు. కాని యింతలో అమ్మగారు పోవడం, శంకరం చదువు ఆ గ్రామంలో పూర్తయి పై చదువులు చదివించాలన్న నిశ్చయంతో వారి కుటుంబం ఉన్న భూమి నంతా అమ్మి మదరాసు వలసపోవడం జరిగింది. అక్కడే ఇల్లు కొనుక్కున్నారని తెల్సింది కూడా. అంతే.... మేనత్తలేని మా కుటుంబాన్ని వారు మర్చే పోయారు. మరి వారి సంగతే తెలియలేదు. నేటికి కన్నులకరువు తీరా బావను నీ మూలంగా చూడగలిగాను." తృప్తిగా దీర్ఘ నిశ్వాస విడిచింది జలజ.

"అయితే నేను నిర్ణయించుకున్నది తప్పక ఫలిస్తుంది. అందుకు సందేహంలేదు సరికదా మీ బంధుత్వం కూడా దగ్గర పడుతుంది." పూర్ణమనసుతో అంది.

"శంకరం వాళ్లు ఇప్పుడెక్కడకు వెళతారు?" జలజ మనసులోని మాట అంది.

"ఏమో ఎవరికి తెలుస్తుంది. నిన్ను చూసింతర్వాత మీ యింటికి గాని వెళ్ళి వుంటారు."

"ఇల్లు తెలియందే !"

ఎవరినైనా కనుక్కుంటారు నోరుంటే ఇల్లు తెలీక పోదు?"

"ఇప్పుడేం చేద్దాం మరి"

"మీ యింటికే పోదాం, అక్కడకు వారు వచ్చిందీ లేందీ తెల్సుకుందాం." సుజాత అంది,

"వేగం మరి వస్తావా !" ఆతృత తెలియ పర్చింది జలజ.

"ఉండు. ఇప్పుడే ఈ గంగిరెద్దు బరువు వదల్చుకు వస్తాను." అని చెప్పి లోనికి పోయింది.

నగలూ, హారాలు వదలి గబగబా వచ్చి స్నేహితురాలితో ముందుకు నడచింది సుజాత.

జలజతో తన కూతురు అతిగా ప్రవర్తిస్తూందని తలచి సుజాత తండ్రి రగులుతూన్న ఉక్రోషాన్ని దిగమింగుకుని కోపంగా తలుపులు వేసుకున్నాడు.

♦ ♦ ♦

"నాన్నా" అంటూ లోపలి గదిలో అడుగుపెట్టిన జలజ అక్కడి వ్యక్తులను చూసి ఒక్కసారిగా ఆగి పోయింది ఆశ్చర్యానందాలు తనను చుట్టివేయగా.

"జలజా ! రాఅమ్మా మేమే ... పైవాళ్ళం కాదు." శంకరం తండ్రి ముద్దుగా పిల్చాడు.

పసిపిల్లలా జలజ అతని దగ్గరే కూర్చుంది, సుజాత వారివారి అభిమానాను రాగాలకు లోలోన సంతసించి జలజ ప్రక్కనే చతికిల పడింది.

"ఏవండోయ్ బావగారూ ! ఈ సుజాతే మా పిల్లనింతవరకూ ఆదుకుంటూ ఏ సహాయం కావలసి వచ్చినా చేస్తూ వచ్చింది. ఈ రోజు మీరు కలియడం కూడా ఈ పిల్ల ధర్మమే. చాల ఉదార స్వభావురాలు." జలజ తండ్రి ఉన్నదున్నట్టు చెప్పాడు.

"నేచేసిందే ముందండీ. అంతా ఆ పరమాత్ముడి దయే. జలజ చెప్పిన సంగతుల బట్టి వీరి కోడలేనా

లజ." జలజకూ తనకూ అంత స్నేహ ముందని గర్వపడుతూ అంది.

"ఏమోనమ్మా! మీ యింట్లో చూపులూ, మా యింట్లో నిర్ణయాలూను." జలజ తండ్రి లోపల ధైర్యమున్నా అనుమానం వ్యక్తం చేసాడు.

"ఏమండీ మీ వుద్దేశం తెలియజేస్తారా?" శంకరం తండ్రిని పెద్దమనిషి తరహాలో అడిగింది సుజాత.

"ఇందులో, ఎవరికి తెలియజేయాలి?" ఏమీ తెలియనట్లూ, జలజను కోడలుగా చేసుకోనట్లూ నటిస్తూ అన్నాడు.

"జలజ విషయం. మీ కోడలని ఏనాడో నిర్ణయించుకున్నారుగా."

"రోజులు మారాయి కదమ్మా" కొద్దిసేపాగి. "ఇంతకీ ఏంచూసి చేసుకోవాలి?" అన్నీ వున్నా లేనట్లుగానే అన్నాడు శంకరం తండ్రి.

జలజ తండ్రితో వచ్చిన వెంటనే తన నిర్ణయం తెయజేయడం వల్ల శంకరం తండ్రి మాటల కెవరూ ఆశ్చర్యపడలేదు.

"ఏం తక్కువని చేసుకోరు?" సుజాత ఎదురు ప్రశ్న"

"కట్నాలూ, లాంఛనాలూ ఏపాటి యిచ్చుకోగలరు?" సుజాత పట్టుదల ఎలాంటిదో తెల్సుకోవాలని అన్నాడు.

"నిజమాడితే నిష్ఠూరం వస్తుంది గాని జలజను కోడలుగా చేసుకుంటే కట్నాలెందుకండీ మామగారూ?"

"ఆ ఆచారం మా యింటా వంటా లేదమ్మాయ్. అదీ గాక వాడి డాక్టరీ చదువుకు పెట్టిన డబ్బంతా ఎలా రాబట్టుకోవడం మరి?"

"చదివించారని ఆ డబ్బంతా రాబట్టాలని ఆడపిల్లల తలిదండ్రుల్ని పీల్చి పిప్పి చేయడమా? ఇంత వరకూ ఆ ఆచారం 'అమల్లో వుండవచ్చు. కాని యికనుంచైనా ఆ మూఢాచారం మానిపోతే అందరూ సుఖించవచ్చు."

"అది మూఢా చారమా?"

"పెద్దవారు మీకు తెలీదా! కట్నాలిచ్చుకోలేక ఎంత మంది పిల్లల తలిదండ్రులు మనోవ్యాధికి గురియి కృశిస్తున్నారో!" విచారం వెలిబుచ్చింది సుజాత.

"నువ్వన్నది నిజమే. కాని ఆభావం ఒక్కసారిగా కూకటి వేళ్ళతో పెకలించడం సాధ్యపడేదేనా?"

"అందరూ అలా అనుకుని ఎవరికి వారే పాత మార్గంలోనే పయనిస్తే ఎలా పెకలించగలరు చెప్పండి! ఇందులో అందరూ సహకరిస్తేనే సాధ్యమవుతుందీ కార్యం. తలోపూవూ వేస్తే దేవుడికో మాల తయారవదండీ!"

"నువ్వు ఏనాటికైనా రాణిస్తావమ్మా! నిన్న నవసరంగా వాదనలోకి దింపానని బాధ పడుతున్నా నిప్పుడు. సరేగాని జలజ ఏనాడో మా కోడలైందమ్మా, జలజ మేనత్తేగాని వుంటే కార్యం ఏనాడో పూర్తయేది. అదృష్టం ఆ యిల్లాలికి లేకపోయింది. అడుగున పడిపోయిన ఈ విషయం నీ మూలంగా పైకివచ్చి నేటికి సంతోషం కల్గించిందమ్మా," తన నిర్ణయం తెలియ జేసాడందరికీ,

నీరసంగా పడుకున్న జలజ తండ్రి లేచి కూర్చుని తృప్తిగా రెండు ఆనంద భాష్పాలు విడిచాడు.

శంకరం- జలజా ఒకరినొకరు చూచుకున్నారు సిగ్గు దొంతరలు వారిని ముంచి వేస్తున్నా.

సుజాత నిండు మనసులో "అదృష్టవంతురాలివి జలజా! మీ కాపురంలో నన్ను మరచిపోకుమీ." అంది.



# అమృతాంజనము

## అన్ని నొప్పులకు దివ్యామృతము

1893 నుంచి లక్షలాది ప్రజలు అమృతాంజనం వాడి, ఎంత అమోఘమైన శక్తి కలదో తెలుసుకుంటున్నారు. అమృతాంజనంలో వాడే ఔషధాలన్నీ అతి శీఘ్రంగా బాధను పశమింప చేయుటయేగాక చాలా హాయిని కూడా కలిగిస్తాయి. హాని కలిగించే పదార్థాలేమీ లేవు కూడా. దగ్గు, జలుబు మొదలైనవి కూడా శీఘ్రంగా ఉపశమిస్తవి. అమృతాంజనం దగ్గర ఉంటే మీ రెటువంటి బాధనైనా జయించవచ్చు.




అమృతాంజన్ లిమిటెడ్,
మద్రాసు-4
బొంబాయి-1,
కలకత్తా-7

'AL-87-1 TELUGU

# సర్వ సభ్య సమావేశం

సభా భవనములో జూలై 13 సాయంత్రం ఆంధ్ర మహిళా సభ సర్వ సభ్య సమావేశం జరిగింది. సభ వ్యవస్థాపక అధ్యక్షురాలు మిర్జాపురం రాణీ గారు సమావేశానికి అధ్యక్షత వహించారు. సభకు చాలామంది సభ్యులు విచ్చేశారు.

వ్యవస్థాపక కార్యదర్శిని శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ గత సమావేశానికి (30 జూలై 1958) యీ సమావేశానికీ మధ్య సాధించిన అభ్యుదయాన్ని సమావేశానికి వ్యక్తపరిచారు. సభ వివిధ సంస్థలూ ఎట్టి ఒడుదుడుకులూ లేకుండా పని సాగిస్తున్నాయని చెప్పారు. ఇరవై రెండు సంవత్సరాలు సేవా కార్యక్రమాలు నిరాటంకంగా కొనసాగిస్తూ వస్తున్న మహిళాసభ తన కార్యక్రమాలు యావత్ దక్షిణ భారత దేశానికీ- ఆంధ్ర కేరళ, మద్రాసు, మైసూరు పాండిచెరీ రాష్ట్రాలకి విస్తరింపజేసింది. వచ్చే రెండు మూడు సంవత్సరాలలో రజతోత్సవం జరుపుకో బోతున్నది. దానికి అప్పుడే సన్నాహాలు ప్రారంభం కావాలి అని అన్నారు.

హైదరాబాదు బ్రాంచి గౌరవ కార్యదర్శిని శ్రీమతి కె సుగుణమణిగారు హోండిక్రాఫ్టు టీచర్సు ట్రైనింగు సంస్థ పురోగతిని వివరిస్తూ నివేదిక చదివారు.

శ్రీమతి బి. తిమ్మాబాయిగారు సభ వివిధశాఖలు— హాస్టలు, విద్యాలయము మొదలైన వాటి నివేదికలను సమావేశానికి అందజేశారు. శ్రీమతి టి. జి. హైమవతిగారు అంబర్ విద్యాలయ, వనితా బాల విహార్ అర్బన్ పైలెట్ ప్రోజెక్టులను గురించి తెలియజేసేరు.

నర్సింగుహోము వివరాలను శ్రీమతి వి. లక్ష్మీ పార్వతిగారు చదివి వినిపించారు. శ్రీమతి ఎ. పర్వత వర్ధనిగారు వనితా బాల విహార్, నాగేశ్వర శిశు విహార్లను గురించి, కె. రామలక్ష్మి ఆంధ్ర మహిళా పత్రిక, ప్రెస్సులను గురించీ నివేదికలు చదివారు.

సమావేశ కర్తలకి శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ - సభకి 291 మంది యావజ్జీవ సభ్యులూ, 17 గురు పోషకులూ వున్నారని తెలియపరిచారు. సభవారి హైదరాబాదు బ్రాంచికి 6 యావజ్జీవ సభ్యులూ, 25 మంది వార్షిక సభ్యులూ, 80 మంది నెలసరి సభ్యులూ వున్నారని చెప్పారు.

ఆదాయ వ్యయాల లెక్కలూ, జమా ఖర్చులూ మొదలైనవి యిటువంటి సర్వ సభ్య సమావేశానికి ముందుగానే అచ్చువేసి పంపించే ఏర్పాట్లు చేయాలని సూచించారు. శ్రీమతి దేశ్‌ముఖ్. అప్పుడే సభ్యులకి అన్ని వివరాలూ ముందు తెలిసి వుంటాయనీ, వారు వాటిని సమావేశంలో చర్చించడానికి వీలుంటుందనీ ఆమె అన్నారు.

ఆడిట్ కాబడిన లెక్కలు సమావేశ కర్తలు ఏక గ్రీవంగా ఆమోదించారు.

శ్రీమతి బి. కృష్ణవేణమ్మగారు. సర్వ సభ్య సమావేశ కర్తల ప్రతినిధిగా ట్రస్టుబోర్డునకు తిరిగి ఎన్నిక అయినారు.

ఈ క్రింది వ్యక్తులు కార్య నిర్వాహక వర్గంగా ఎన్నిక అయినారు.

1. శ్రీమతి బి. తిమ్మాబాయి
2. " పర్వత వర్ధని
3. " లక్ష్మీపార్వతి
4. " టి. జి. హైమవతి
5. " కమలా కేశవరావు
6. " సంపూర్ణమ్మ
7. " లక్ష్మీకాంతమ్మ
8. " రంగనాయకమ్మ
9. " కమలాబాయి

శ్రీమతి టి. జి. హైమవతిగారు నాల్గవ కార్యదర్శినిగా ఎన్నిక అయినారు. వీరు పారిశ్రామిక కేంద్రం, ప్రెస్సు, అర్బన్ పైలెట్ ప్రోజెక్టు అంబరు విద్యాలయాల పని చూస్తారు. బి. తిమ్మాబాయి, ఎ. పర్వతవర్ధని వి. లక్ష్మీపార్వతి గారలు తిరిగి 1959-60 కార్యదర్శులుగా ఎన్నిక అయినారు.

ఆంధ్ర మహిళ సంపాదకురాలిగా వుంటున్న శ్రీమతి కె. లక్ష్మి రఘురామ్ కారణాంతరాల వల్ల తానాపదవినుండి విరమించుకోవాలని కోరారు, ఆమె కోర్కెను మన్నించి ఆమె స్థానే శ్రీమతి రామ లక్ష్మిని నియమించడం తగునని ట్రస్టుబోర్డునకు

సూచించడం జరిగింది. వారందుకు ఒప్పుకున్నారు. కార్యదర్శిని యీ విషయంలో తగు చర్య తీసుకోవలసినదిగా కోరడం అయింది. శ్రీమతి రామలక్ష్మి సంపాదకురాలుగానూ, శ్రీమతి టి. జి. హైమవతి ప్రిటరు పబ్లిషరుగానూ డిక్లరేషను పుచ్చుకోవలసి వున్నది. ఈ సందర్భంలో శ్రీమతి లక్ష్మీరఘురామ్ గారి సేవను సర్వ సభ్య సమావేశం తన కృతజ్ఞతను వెల్లడించింది.

ఈ క్రిందివారు నర్సింగుహోము కార్య నిర్వాహక వర్గంగా ఎన్నిక అయినారు.

1. శ్రీమతి వి. లక్ష్మీపార్వతి
2. " ఎ. సి. కృష్ణరావు
3. " రాజ్యలక్ష్మి ప్రసాద్
4. డాక్టరు ఎ. అవధాని
5. " ఇందిరా రామమూర్తి
6. శ్రీ వి. హనుమంతరావు
7. " బి. వి. డి. నారాయణరావు

ఫామిలీ ప్లానింగు కార్యక్రమ నిర్వహణకి గాను ఒక ప్రత్యేక కమిటీ యీ క్రింది సభ్యులలో రూపొందించ బడింది.

1. శ్రీమతి లక్ష్మీపార్వతి
2. డా॥ పవనాబాయి
3. డా॥ వేదమాణిక్యం
4. డా॥ లక్ష్మి

సర్వ సభ్య సమావేశం, కృతజ్ఞతాభివందనలతో ముగిసింది.

అధ్యక్షురాలు
**శ్రీమతి లక్ష్మీవెంకాయమ్మ రావు**

## ట్రస్టుబోర్డు సమావేశం

జూలై 13 సాయంత్రం 7 గంటలకు ఆంధ్రమహిళా సభ ట్రస్టుబోర్డు సమావేశం జరిగింది. వ్యవస్థాపక అధ్యక్షురాలు మీర్జాపురం రాణీగారు అధ్యక్షత వహించారు. యీ క్రింది సభ్యులు హాజరయారు.

1. శ్రీమతి రాణీ లక్ష్మీవెంకాయమ్మారావు.
2. ,, ఎ. సి. కృష్ణారావు.
3. ,, దుర్గాబాయి దేశ్‌ముఖ్
4. ,, బి. కృష్ణవేణమ్మగారు.
5. డాక్టరు ఎ. అవధాని
6. శ్రీ వి. హనుమంతరావుగారు.

సర్వసభ్య సమావేశంలో జరిగిన చర్చలు, చేసిన తీర్మానాలూ యీ మీటింగులో చర్చించి ఆమోదింప బడ్డాయి. కార్యదర్శులఎన్నిక. 1. బి. తిమ్మాబాయి సభమహిళా. విద్యాలయ, హాస్టలు అజమాయిషికీ,

2. వి. లక్ష్మీపార్వతిగారు నర్సింగుహోము అజమాయిషీ.

3. శ్రీమతి పర్వతవర్ధనిగారు నాగేశ్వర శిశు విహార్, వనితా బాలవిహార్ అజమాయిషీ.

4. శ్రీమతి టి. జి. హైమావతి ప్రెస్సు. పారిశ్రామిక కేంద్రం. అర్బన్ ప్రైవేట్ ప్రోజెక్టు, అంబరు విద్యాలయాల అజమాయిషీలకీ ఎన్నిక అయారు. ఇది ట్రస్టుబోర్డు ఆమోదించింది. రామలక్ష్మి మహిళా పత్రిక సంపాదకురాలిగా అయిన ఎన్నిక కూడా ఆమోదించ బడింది.

శ్రీమతి ఎ. సి. కృష్ణరావు యీ క్రింది సూచనలు చేశారు.

కేంద్రరాష్ట్ర ప్రభుత్వాల నుండి నర్సింగుహోము నకు అందిన గ్రాంటుల వివరాలు ఇతర విరాళాల వివరాలు ట్రస్టుబోర్డు వారికే కాకుండా సర్వసభ్య సమావేశంలోకూడా పెట్టాలని సూచించారు. దాన్ని ఆమోదించి, కార్యదర్శులు ఆడిటర్లను ఆగ్రాంట్ల వివరాలతో ప్రత్యేకంగా జమాకర్చులపత్రం తయారు చేయవలసినదిగా కోరాలని ట్రస్టుబోర్డువారు కోరారు. 1958-59 లెక్కలు పై విధంగా జరగాలని నిశ్చయించారు.

వివిధశాఖల నివేదికలూ, కరపత్రాలతో పాటు ఆడిట్ కాబడిన జమాఖర్చుల వివరాలు కూడా సభ్యులకు సర్వసభ్య సమావేశానికి 15 రోజులు ముందుగానే అందించాలని సూచించారు.

సమావేశ అధ్యక్షురాలికి కృతజ్ఞతలు తెలుపుతూ సమావేశం ముగించడం జరిగింది.

## కార్యనిర్వాహక వర్గ సమావేశం

జూలై 18 వ. సాయంత్రం 4.30 గం. సభా భవనంలో కార్యనిర్వాహకవర్గ సమావేశం జరిగింది.

లక్ష్మి వెంకాయమ్మారావు. మీర్జాపురం రాణీగారు అధ్యక్షత వహించారు. యీ క్రింది సభ్యులు హాజరయారు.

1. శ్రీమతి లక్ష్మివెంకాయమ్మారావు.
2. ,, దుర్గాబాయ్‌దేశ్‌ముఖ్
3. ,, లక్ష్మీపార్వతి.
4. ,, పర్వతవర్ధని.
5. ,, కమలా కేశవరావు
6. ,, సంపూర్ణమ్మగారు
7. ,, లక్ష్మీకాంతమ్మ
8. ,, తిమ్మాబాయి
9. ,, రంగనాయకమ్మ
10. ,, కమలాబాయి

ప్రత్యేకాహ్వానంపై యీ క్రింది సభ్యులు హాజరయారు.

1. శ్రీమతి కె. రుక్మిణమ్మ
2 ,, టి. జి. హైమావతి
3. ,, ఎ. సరస్వతి
4. ,, కె. సుగుణమణి

జూన్ 29 1958-నాడు జరిగిన సమావేశవివరాలు 1957—58 జమాఖర్చులు, ఆమోదించి సర్వసభ్య సమావేశానికి అందించారు.





## శ్రీమతి వి. లక్ష్మీపార్వతి

స్టాక్‌హోమ్‌లో జరుగనున్న మహిళా శాంతి స్వాతంత్ర్య సమితి సమావేశంలో పాల్గొందుకు మద్రాసు ప్రతినిధిగా శ్రీమతి వి. లక్ష్మీపార్వతిగారు గత మాసం 24 వ. తేదీ బయలు దేరి వెళ్ళారు. మద్రాసు మీనంబాకం విమానాశ్రయంలో మహిళాసభ వివిధ శాఖలవారు యీమెకు ఘనంగా వీడ్కోలిచ్చారు. మూడు మాసాలపాటు విదేశాలలో పర్యటించి తిరిగివస్తారు యీమె.

# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూర్ - మద్రాసు

| | |
|---|---|
| మహిళా విద్యాలయము | : హిందీ కాశీవిశ్వవిద్యాలయపు ఎడ్మిషన్, ఇంటర్మీడియెట్, ఆంధ్ర మెట్రిక్, ఇ.ఎస్.ఎల్.సి., పరీక్షలకు శిక్షణ. |
| పారిశ్రామిక విద్యాలయము | : కుట్టు, ఎంబ్రాయిడరీ ఊలు అల్లికలు, నూలు వడకుట, చేనేత, అచ్చుకూర్పు, ముద్రణ, బైండింగ్ ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ, బీద విద్యార్థినులకు ఉచితము. |
| పారిశ్రామిక శిక్షణ కేంద్రము | : 7-వ రోజరీ చర్చిరోడ్డులో ఆంధ్ర మహిళాసభ పారిశ్రామిక భవనములో వస్త్రములపై అద్దకపుపని, మిషనుకుట్టు, మిషను అలిక, చేనేత, బుక్ బైండింగు, ఎంబ్రాయిడరీ మొదలగు పరిశ్రమలలో శిక్షణ ఇవ్వబడుచున్నది. |
| టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్ | : స్త్రీలకు టైపు.—గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ. |
| మహిళా మందిరము | : స్త్రీ విద్యార్థినులకు వసతి గృహము. |
| ఆంధ్ర మహిళ | : స్త్రీలలో విద్యా వ్యాప్తికై స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాస పత్రిక |
| నర్సింగ్ హోమ్ | : స్త్రీ శిశు సంరక్షణశాల, ప్రసూతిశాల, ఉచిత వైద్యశాల, కుటుంబ నియంత్రణశాఖ, దంత వైద్యశాఖ—అడయారులో నిర్మించబడినది. భారత ప్రభుత్వ ఆరోగ్య శాఖవారి విధానాన్ని అనుసరించి, సంక్షిప్త నర్స్ ఎయిడ్—మంత్రసాని పనులలో శిక్షణ యివ్వబడుచున్నది. |
| ముద్రణాలయము | : ఆంధ్ర మహిళా సభ వారిచే స్వంతంగా స్థాపించబడినది. విద్యార్థినులకు అచ్చుకూర్పు, బైండింగ్, ప్రూపు రీడింగు, మొదలైనవి ఉచితంగా నేర్పబడును. |
| నాగేశ్వర శిశువిహార్ | : పిల్లల విద్యా వినోద కేంద్రం. |
| వనితా బాలవిహార్ | : స్త్రీలకు, పిల్లలకు, పార్కు, ఆటస్థలం. |

# ఆంధ్ర మహిళా సభ నివేదిక

**1958** జూలై 3౦ వ తేది సర్వ సభ్య సమావేశమైన వెనుక కార్య నిర్వాహక వర్గము 5 మార్లు సమావేశమైరి. సభయొక్క కార్యక్రమములు. జమా ఖర్చులు, సభ్యురాండ్రకు ఎప్పటికప్పుడు తెలియజేయడమైనది.

### పండుగలు

వినాయక చతుర్థి, కృష్ణాష్టమి, దీపావళి, దసరా సంక్రాంతి, వరలక్ష్మి వ్రతము మొదలగు పండుగలు మామూలుగా జరిగినవి.

స్వతంత్ర దినోత్సవమున శ్రీమతి అంబుజమ్మాళ్ గారు పతాకము ఎగురవేసిరి. పిల్లల పాటలు జండా వందనముతో కార్యక్రమము ముగిసినది. ఈ సంవత్సరము జండా ఉత్సవములు 30 వ తేదీ నుండి 23 వ తేదీవరకు జరిపితిమి. బొమ్మల కొలువు, వస్తు ప్రదర్శన, వినోద కార్య క్రమము మొదలగు వాటిలో సభ్యులు, విద్యార్థినులు, సభ్యురాండ్ర పిల్లలు, పాల్గొనిరి. చాలామందిని యావజ్జీవ సభ్యురాండ్రగా చేసిరి. ఈ సంవత్సరము సభ్యురాండ్రందరూ వచ్చి వినోద కార్యక్రమము చూచుటకు గాను ప్రత్యేకముగా పందిరి వేసి స్టేజి ఏర్పాటు చేశాము. వస్తు ప్రదర్శనకు శ్రీమతి తారా చెరియన్ గారు ప్రారంభోత్సవం చేశారు. బహుమతి ప్రధానము శ్రీమతి వర్గీసు గారు చేశారు.

### హాస్టలు దినము

జనవరి 14 వ తేదీ హాస్టలు దినము చేసి 200 మందికి విందు చేశాము. వినోద కార్యక్రమము కూడా ఏర్పాటు చేశాము. శ్రీ దేశ్ ముఖ్ గారు శ్రీ దుర్గాబాయ్ దేశ్ ముఖ్ గారు శ్రీ శ్రీమాలీగారు విద్యాశాఖ మంత్రిగారు పార్లమెంటు మెంబర్లు కూడా వచ్చిరి.

### విజిటర్సు

శ్రీమతి పుష్పలతాదాస్, శ్రీమతి అమ్ము స్వామినాథన్ శ్రీ నారాయణప్రసాద్ శ్రీమతి. డరోతి వైట్ భా సంస్థలను చూశారు. C. S. W. B కార్యదర్శి ఆర్. ఎస్. కృష్ణగారు కూడా వివిధ సంస్థలని చూశారు.

### విద్యాలయ

1958-59 లో బెనారసు మెట్రిక్ కు 37 మంది విద్యార్థినులు వెళ్ళగా 30 మంది ఉత్తీర్ణులయ్యారు. ఆంధ్ర మెట్రిక్ లో ఆరుగురు ఉత్తీర్ణులయ్యారు.

### రాజ్యలక్ష్మి పారిశ్రామిక విద్యాలయం :—

26 మంది ప్రభుత్వ పరిక్షకు వెళ్ళగా 16 మంది పాసు అయినారు.

### అంబర్ విద్యాలయ

జూలై మాసములో మొదలుపెట్టిన మొదటి జట్టు విద్యార్థులు 43 మంది కోర్సులు ముగించుకొని మార్చి మొదటి వారంలో వారి వారి గ్రామాలకు వెళ్ళిరి. రెండవ జట్టు 34 మంది ఉన్నారు. వారికి కూడా మూడు మాసములు కోర్సు ముగిసినది. అంబరు చర్ఖాలపై తీసిన ఖద్దరు నూలుతో మన వద్దనున్న మగ్గములపై ఖద్దరు బట్ట తయారు చేయుటకు ఒక Weaver, ఇద్దరు సహాయకులను వేశారు.

### విజ్ఞాన యాత్రలు

అంబర్ విద్యాలయ విద్యార్థులును సభ విద్యార్థినులను మహాబలిపురము, పక్షీతీర్థము, కంజీవరము తీసుకువెళ్ళినాము. ఒరిస్సానుండి విద్యార్థినులు వచ్చి సభలో 3 రోజులు ఉండి మద్రాసు చుట్టుపట్లనున్న ముఖ్య స్థలములు చూచి వెళ్ళారు,

### అర్బన్ వెల్ ఫేర్ ఎక్స్ టెన్ షన్ ప్రోజెక్టు

మే 15 వ తేదీనుండి దీని ప్రారంభించాము. ఒక సంఘ సేవికను ఒక చేతిపని టీచరును నియమించాము. వారు పిల్లలకు ఆట పాటలు, కుట్లు నేర్పుతూ, ఇళ్ళకు వెళ్ళి వస్తున్నారు. పాల పంపకము కూడా చేయుచున్నారు.

### శిశువిహార్

36 మంది బాల బాలికలు విద్యనభ్యసించుచున్నారు. ఈ సంవత్సరము 1, 2, క్లాసులు పెట్టుటకు తగిన ప్రయత్నములు చేస్తున్నాము.

### వనితా బాల విహార్

ఇక్కడ పిల్లలు, పెద్దలు, విశ్రాంతికి, సామానులు, మొదలైనవి పెట్టుటకు ఒక కట్టడము కట్టుచున్నాము. రోజూ సాయంకాలము పిల్లలు, పెద్దలు వచ్చి కూర్చొనెదరు. పారిశ్రామిక విద్యాలయంమీద, హాస్టల్ భవనంమీద C. S. W. B వారి గ్రాంటులో 2 హాలులు కట్టడమైనది. సభకు 50 ఇనుప కుర్చీలు, జేపురికార్డరూ కొన్నాము. అంబరు విద్యాలయ గ్రాంటులో 1000 రూపాయలకు హాస్టలుకు పాత్రలు కొన్నాము.

గత సంవత్సరంలో యావజ్జీవ సభ్యులుగా చేరినవారి పేర్లు యీ దిగువ యిస్తున్నాము.

1. శ్రీమతి కొడాలి అన్నపూర్ణగారు
2. " కోకా కామాక్షమ్మగారు
3. " బేటా లీలా నాయుడుగారు
4. " వెంకుబాయమ్మగారు
5. " లలితా రాజామణిగారు
6. " ఎ. సరస్వతిగారు
7. " ఎస్. లలితాబాయిగారు
8. " లలితారామ్‌గారు
9. " దరిశి సుభద్రమ్మగారు
10. " మోదవరపు లక్ష్మీ నరసమాంబగారు
11. " ఆర్. వి. సరోజినిగారు
12. " సామర్ల లీలావతిగారు
13. " అక్కినేని అన్నపూర్ణగారు
14. " బొమ్మిరెడ్డి సుభద్రగారు
15. " వి. ఆర్. తులసమ్మగారు
16. " రంగనాధం రాజ్యలక్ష్మిగారు
17. " కావేరి బాయిగారు
18. " వీరపనేని కృష్ణకుమారిగారు
19. " రేలంగి కుసుమ కుమారిగారు
20. " ధనలక్ష్మీ నహతా
21. " ధరణిప్రగడ శేషాయమ్మగారు
22. " మన్యం కామేశ్వరమ్మగారు
23. " రమా బెన్‌షాగారు
24. " వసుమతీ బెన్‌షాగారు
25. " జయలక్ష్మీ అమ్మాళ్ గారు
26. " వి. ప్రేమ
27. " కొసరాజు శ్యామల
28. " గంగాబాయి పి. జిప్పి.
29. " శాంతాబెన్ పాపట్ లాల్‌షా

వీరిలో- 500 రూ యిచ్చి శ్రీమతి ధనలక్ష్మీ నహతా, శ్రీమతిశాంతాబెన్‌పాపట్‌లాల్‌షాగారలుపోషకులైనారు.

## ఆంధ్ర మహిళా ప్రెస్ నివేదిక

**57**-58 సంవత్సరం సామాన్యంగా గడిచిపోయింది. ఆర్థికమైన అనేక యిబ్బందులని, నిర్వాహకులు దిన దినం ఎదుర్కోవలసి వచ్చింది. అయినా కూడా ప్రెస్సు నడవటం కష్టం అయింది. మూల ధనం కొంచెం కూడా లేకుండా జాబ్ వర్కులు తీసుకోవడం వల్ల అవి సకాలంలో అందచేయలేక పోవటం వంటి అనేక యిబ్బందులు కలిగాయి ;

ఈ ఆర్థిక సంవత్సరం ఆరంభం అయేసరికి ఆంధ్ర మహిళా ప్రెస్‌కు ఆదాయం చెప్పుకో తగ్గది లేకపోగా అప్పులు—అందులోనూ కొద్ది కాలవ్యవధిలో తీర్చవలసినవి 10 వేల వరకూ ఏర్పడ్డాయి. వీటిని ఎలాగో కష్టపడి తీర్చే ప్రయత్నాలు చేసి ప్రెస్సుని గట్టి పునాదిపై నిలపాలని కార్యకర్తలు నిశ్చయించారు- దాని ఫలితంగానే జనవరి నెలలో వినోద కార్యక్రమం ప్రదర్శించటం జరిగింది. ఈ వినోద కార్యక్రమం రూపొందించడం ఒక సమస్యే కాలేదు. అందులో పాల్గొన్న అందరూ ఎంతో ఉత్సాహ వంతులు, అడగడమే తడవుగా ముందుకి వచ్చారు సహాయం చేయడానికి. కష్టమైనా కూడా శ్రీమతి వి. లక్ష్మీపార్వతిగారు స్వంతంగా తిరిగి సేకరించారు ఈ - మొత్తం దరిదాపు 11 వేలు, ఇందును ప్రెస్ సర్వదా ఆమెకు కృతజ్ఞులం అని యీ నివేదిక ద్వారా తెలియచేస్తున్నాం. ఆవిడే కనుక ఆ కృషి చేయకుంటే ప్రెస్‌లో యీ పాటికి విపరీతమైన పరిణామాలు వచ్చి వుండేవి. ప్రస్తుతం అప్పులన్నీ తీర్చి వేయడం అయింది.

జనవరి లోనే మహిళా ప్రెస్ చూడడానికి కేంద్ర విద్యా శాఖ మంత్రి శ్రీ శ్రీమాలి వచ్చారు. ప్రెస్‌వారి కృషిని మెచ్చుకున్నారు. అభినందించారు.

ఇక ప్రెస్సులో పనిచేసే అమ్మాయిలకి విశ్రాంతికి ఒక గది మొదలైన అవసరాలు వున్నాయి. వీటిని కార్యకర్తలు నిర్ణయించి సమకూరుస్తారని ఆశిస్తున్నాం.

వస్తుతం జాబ్ వర్కుల మూలంగా ఆదాయం అధికంగా కాకున్నా ఏదో ఖర్చుకి సరిపడ వస్తూంది. ప్రెస్సు యింకా బాగా ఆర్థికంగా విజయవంతంగా నడిపించాలంటే— కొంచెం మూల ధనం వెచ్చించి కొత్త టైపులూ కేసులూ పెట్టవలసి వుంటుంది. పేపరుకి గోడౌన్ ఏర్పరచు

కోవలసి వస్తుంది. ఇవి కూడా కార్య కర్తలు ఆలో చిస్తారని నమ్ముతున్నాం.

పోయిన సంవత్సరాంతంలో ఆంధ్ర మహిళ పత్రికా సంపాదకురాలు శ్రీమతి కె. లక్ష్మీరఘురామ్ గారి సాంఘిక నవల "సింగినాదం" ముద్రించడం జరిగింది. ఈ సంవత్సరాంతం లోపున ఆమెదే "హక్కు" అనే వ్యాస సంపుటి అచ్చు అవుతుంది. కె. రామలక్ష్మి రచించిన "దారి చూపిన దీపకళికలు" అనే వ్యాస సంపుటి కూడా అచ్చు గానున్నది. యీ ప్రచురణలకి పేపరు రచయితలు పెట్టుకున్నారు.

## నర్సింగుహోము నివేదిక

గత ఆర్థిక సంవత్సరంలో నర్సింగ్ హోమ్ కార్య కలాపాలు రోజు రోజుకు రోజుకు అభివృద్ధి గాంచుతూ, ముందుకు సాగుతూనే యున్నాయని చెప్పుటకు, మేము సంతోషిస్తున్నాము. ప్రస్తుతం ఈ నర్సిగ్ హోమునకు, ఒక ఔట్ పేషంటు వార్డు, పురిటి గది దానికి సంబంధించే రెండు బాలింతల వార్డులు, మెడికల్ వార్డు ఒకటి, ఒక చిన్నపిల్లల వార్డు, సెప్టిక్ వార్డు యున్నవి. అక్టోబరు, 1957 నుండి దంత చికిత్సకు, కుటుంబ నియంత్రణకు ప్రసూతి వైద్యాలకు, ప్రత్యేకించి క్లినిక్కులు పని చేస్తున్నవి. ప్రస్తుతం మొత్తం 56 మంచాలున్నవి. వీటిలో 32 పురిటి కేసులకు, 12 సాధారణ రోగులకు, 12 పిల్లలకు ప్రత్యేకింపబడుతున్నాయి. ప్రతిదినం రెండు, రెండువందల ఏబదివరకు ఔట్ పేషంట్లు ఉచిత వైద్యశాలలో సౌకర్యం పొందుతున్నారు. సరాసరి సంవత్సరానికి, రోగుల భోజనమునకు 3000 మందులు ఇతరసామానులకు 15,000, ప్రక్కబట్టలు మొదలైనవాటికి 1, 500, రూపాయలు ఖర్చు అగుచున్నవి. నర్సింగ్ హోమ్‌లో బీదలకు ఉచితంగా మందులు దొరకటమేగాక, ఉచిత వైద్య చికిత్స, సదుపాయం కూడ లభ్యమవుతూయుంది. నెల సరి ఆదాయం 50 రూపాయల లోపు రోగులకు, చికిత, భోజనం, పడక, సౌకర్యాలు ఒక వారం రోజులపాటు, ఉచితంగా యివ్వబడుచున్నది.

క్లిష్టమైన కేసులు పరీక్షించుటానికి, ప్రఖ్యాతిగన్న డాక్టర్ కె. యస్. సంజీవి వారమునకు రెండు రోజులు వచ్చి సహాయపడుచున్నారు. దంత వైద్యులు డాక్టరు పి. ఎస్. వి. గిరి; పిల్లల వైద్యులు డాక్టరు ఎస్. నాగ స్వామి. గార్లు కూడా నర్సింగ్ హోమ్ సహాయార్థం, ఉచితంగా సేవ చేయుచున్నారు.

నర్సింగ్ హోమ్‌లో ఆపరేషను థియేటరు, సర్జికలవార్డు నిర్మాణానికై మద్రాసు ప్రభుత్వం 1 లక్ష రూపాయలు గ్రాంటుగా యిచ్చినది. 54 వేల రూపాయలు ఎక్విప్ మెంటు గ్రాంటుగా కేంద్ర ప్రభుత్వ యిచ్చినది. పై రెండు వార్డుల నిర్మాణం దాదాపు పూర్తి కావచ్చినది. ఈనెల 28 వ తారీఖున వీటికి ప్రారంభోత్సవం పరుప నిశ్చయింపబడినది. సర్. ఎస్. రాధాకృష్ణన్ గారు ప్రారంభోత్సవం చేయుటకు నిశ్చయించారు.

భారత దేశపు పసిబాలురకు సేవచేసే నిమిత్తం, ఆంధ్రమహిళాసభ, యింకొక ప్రాజెక్టును కూడ చేబడుతూ యుంది. ఈ ప్రణాళికకు పునాది కల్పించినది, శ్రీ, శ్రీమతి హనుమంతరావు గారలు యిచ్చిన 1 లక్షరూపాయల భూరి విరాళమే. వీరి విరాళాన్ని, ఆర్థోపెడికల్లీ వికలాంగులయిన, పిల్లలకు వైద్య చికిత్స కొరకు, విద్యా సదుపాయాలు సమకూర్చటం కొరకు, వారిని తిరిగి సంఘంలో కోటి వ్యక్తులలా మెలగడానికి తగిన అవకాశము కల్పించుటకుగాను, ఈ విరాళం, ఒక కేంద్ర నిర్మాణానికి యిచ్చారు. ఈశ్వరీప్రసాద్ దత్తాత్రేయ, ఆర్థోపెడిక్ సెంటరు భవన నిర్మాణం నర్సింగ్ హోమ్ ఆవరణలోనే జరుగుచున్నది. దీనిలో ఫిజియోథెరపి, ఆక్యుపేషనల్ థెరపి, కోసం సదుపాయాలు, పిల్లల మ్యూజియం, థియేటరు, ఉంటాయి. దీనిని అభివృద్ధిపరుచుటకై కేంద్ర ప్రభుత్వం, 1, 34,000 రూపాయలు గ్రాంటు మంజూరు చేసినది.

### —ఆక్సిలరీ మిడ్‌వైపులకు శిక్షణ—

### (2. సంవత్సరములు)

1958 జూలై నాటికి 100 మంది, 5 జట్లుగా మన నర్సిగ్ హోమ్‌లో శిక్షితులై బైయటకు వెళ్ళినారు. వీరిలో 99 మంది ప్రసూతి అసిస్టెంట్లుగాను, హెల్తు విజటర్లుగాను, వివిధ వెల్ ఫేరు ఎక్స్టెన్ షన్ ప్రాజెక్టులలోను బ్లాకు డెవలప్‌మెంటు కేంద్రాలలోను, నియమితులైయున్నారు. 1958 జూలైలో 29 మంది, ఏడవ జట్టులో సీనియర్సు, జూనియర్సుగా తీసుకొనబడినారు. వారు ఒక సంవత్సరం కోర్సు ముగించినారు. ఆరవజట్టు 30 మంది లోను 15 గురు కోర్సు ముగించి ఆఖరు పరీక్షకు గత వారంలో కూర్చొన్నారు. మిగిలిన జూనియర్లు 15 గురు నవంబరు 1959, పరిక్షకు వెళ్ళెదరు. 8 వ జట్టుకు సెలక్షన్ ఈ నెలాఖరులోగా జరుగనున్నది. వారు ఆగస్టు, నవంబరులలో, రెండు జట్లుగా శిక్షణ పొందనారంభించెదరు.

కేంద్ర ఆరోగ్య శాఖవారు ఆక్సిలరీ మిడ్‌వైఫులకు శిక్షణకు సహాయం చేస్తున్నారు. రెండవ పంచ ప్రణాళికలలో కూడ రికరింగు గ్రాంటుగా 64,200 రూ, ప్రతి సంవత్సరము 60 మందికి యిస్తున్నారు. వీరిలో 30 మంది మొదట సంవత్సరం వారు, 30 మంది రెండవ సంవత్సరపు వారు యుండెదరు.

కేంద్ర సాంఘిక, సంక్షేమ సంస్థ కామన్ హాలు నిర్మాణార్థం 15,000 రూపాయలు విరాళంగా యిచ్చినది. ఈ భవనానికి జనవరిలో కె. ఎల్. శ్రీమాలిగారు ప్రారంభోత్సవం చేశారు.

### ఫామిలీ ప్లానింగ్ క్లినిక్

1957 నవంబరులోనే ఫామిలీ ప్లానింగ్ క్లినిక్ ప్రారంభించినాము. అప్పటినుండి, యిప్పటివరకు 1,896 కేసులతో పరిచయం ఏర్పడింది. మన సంఘ సేవిక యింటి యింటికి వెళ్ళి ప్రచారం చేస్తూయుంటుంది. ఇచ్చట క్లినిక్కులో కేసులను జాగ్రత్తగా పరిశీలిస్తూయుంటుంది. మన నర్సింగ్ హోము పరిసర ప్రాంతంవారందరకు, యీ క్లినిక్కు పరిచయమే. వారంతట వారే వస్తూయున్నారు. ప్రజానీకంలో దీనిపట్ల ఉత్సాహం, కుతూహలం యున్న వనుటకదే నిదర్శనము. మెడికో, సోషల్ వర్కర్ల తర్ఫీదు ప్రారంభించగనె ఈ రంగంలో పని యింకనూ ఎక్కువగా జరగగలదని ఆశించుచున్నాము.

**ఫామిలీ ప్లానింగు కార్యక్రమము కొరకు, ఫామిలీ వెల్ఫేరు వర్కర్లకు తర్ఫీదు— శిక్షణకాలం- 1 సంవత్సరం**

కేంద్ర ప్రభుత్వం. ఫామిలీ ప్లానింగు కార్యక్రమము కొరకు ఫామిలీ వెల్ఫేరు వర్కర్లకు తర్ఫీదునివ్వటానికి ఈ సభను, దేశంలోని మొత్తం మూడు రీజనల్ సంస్థలలో ఒక దానిగా ఎన్నుకొన్నది. మొదట టట్టు శిక్షణ యీనెల 10 వ తా॥ ప్రారంభమైన దీనికి ఆంధ్ర, కేరళ, మద్రాసు, మైసూరు, పాండిచెరి లనుంచి 50 మందిని ఎన్నుకొన్నారు. ప్రభుత్వవారు 1,05,000 రూపాయలు గ్రాంటుగా యిచ్చియున్నారు. ఆ మొత్తంలో 50 వేలు నాన్ రికరింగు గ్రాటు, 55 వేలు రికరింగు గ్రాంటు. డాక్టరు సరోజిని వేదమాణిక్యం, మిస్. డి. సులోచన ఈ శిక్షణకు ఉపాధ్యాయిలుగా నియమితులైనారు. వీరిద్దరు. బొంబాయి ఫామిలి ప్లానింగ్ రిసర్చి ట్రైనింగు సెంటరుకి వెళ్ళి ట్రయినింగు అయినారు.

1958 ఏప్రియల్‌లో నర్సిగ్‌హోమ్‌కు ధనసేరకణకుగాను ఒక ఫెటె- ఏర్పాటు చేసినాము, మద్రాసు గవర్నర్ శ్రీ బిష్ణూరామ మెధీ 300 రూ. విరాళంగా ప్రకటిస్తూ ఈ ఉత్సవానికి ప్రారంభోత్సవంజరిపారు. నర్సింగ్ హోమ్ సభ్యులు, సభ సభ్యులు, మహిళాసభ అభిమానులందరూ ఈ సందర్భంలో ఉత్సాహంగా పాల్గొని 3,703 12 రూ॥ సేకరించారు. కర్చులు పోను 2,492- 81 నయాపైసలు మిగిలింది.

నర్సింగు హోములో మంచాల పోషణకు అనేక సంస్థల నుండి, అనేకమంది వ్యక్తులనుండి, ఈ క్రిందినుదహరించిన విరాళాలు ప్రోగు చేశాము.

1952 నుండి 1959 వరకు లెక్కలు యిచ్చాము.

| సంవత్సరము | ఔట్ పేషంట్సు | ఇన్ పేషంట్సు | పురిటి కేసులు |
|---|---|---|---|
| 1952 | 2,815 | — | — |
| 1953 | 8,124 | 73 (జూలై నుండి డిశంబరు వరకు) | 25 (అగస్టు నుండి డిశంబరు వరకు) |
| 1954 | 17,848 | 128 | 438 |
| 1955 | 35,272 | 2,246 | 999 |
| 1956 | 38,715 | 3,464 | 1,238 |
| 1957 | 50,734 | 4,793 | 1,563 |
| 1958 | 51,765 | 5,489 | 1,825 |
| 1959 | 28,903 | 2,553 | 884 |

### ఏప్రియల్ నుండి మార్చి వరకు ఆసుపత్రిలోని మంచాలకు సహాయం.

| | | | |
|---|---|---|---|
| 1. | ఇండియా సిమ్మెంటు లిమిటెడ్ - మద్రాసు | .... | 1,000 |
| 2. | బి. రాజగోపాల్ నాయుడు- గుడియాత్తమ్ | .... | 1,000 |
| 3. | మిసెస్. ఇడ్డా ఛాంబర్స్- క్రోమ్ పేట | .... | 500 |
| 4. | మెస్సర్స్, సేతురామ్ త్యాగరాజన్ అండ్ కో- మద్రాసు | .... | 250 |
| 5. | శ్రీ వి. హనుమంతరావు ఐ. ఎ. ఎస్. (రిటైర్డు) | .... | 250 |
| 6. | మెస్సర్స్ స్టాండర్డు డ్రగ్స్ అండ్ కెమికల్సు- మద్రాసు | .... | 250 |
| 7. | శ్రీ తెన్నేటి విశ్వనాధంగారు- న్యూఢిల్లీ | .... | 250 |
| 8. | శ్రీమతి రాణీ రాజ్యలక్ష్మీ ప్రసాద్- మద్రాసు | .... | 250 |
| 9. | ఆంధ్ర మహిళా సభ ఉద్యోగులు | .... | 250 |
| 10. | అసోసియేటెడ్ ట్రాన్సుపోర్టు- మద్రాసు | .... | 250 |
| 11, | నర్సింగ్ హోమ్ స్టాఫ్ | .... | 250 |
| 12. | మెస్సర్స్ డన్‌లప్ రబ్బర్ కంపెనీ లిమిటెడ్ | .... | 240 |
| 13. | మెస్సర్స్ ఆంధ్ర సిమెంటు కో లిమిటెడ్ | .... | 240 |
| 14. | శ్రీ కె. అనంత ప్రసాద్ రామకృష్ణ- మద్రాసు | .... | 240 |
| 15. | మెస్సర్స్ యింపీరియల్ టొబాకో లిమిటెడ్ | .... | 240 |
| 16. | శ్రీమతి కె. రామాయమ్మ- మద్రాసు | .... | 240 |
| 17. | మెస్సర్స్ జైపూర్ షుగర్- కో- మద్రాసు | .... | 240 |
| 18. | మెస్సర్స్ ప్యారీ అండ్ కో- మద్రాసు | .... | 240 |
| 19. | మెస్సర్స్ కె. సి. పి. లిమిటెడ్- మద్రాసు | .... | 240 |
| 20. | హాంట్, మెట్టూరు ఫార్మస్యూటికల్స్- మద్రాసు | .... | 240 |
| 21. | జాయింట్ చీఫ్ కంట్రోలర్ ఆఫ్ ఎక్స్‌పోర్ట్సు అండ్ యింపోర్ట్సు ఆఫీస్ స్టాఫ్ | .... | 167-35 |
| | | మొత్తం— | 6, 817 - 35 |

### మంచముల పోషణ 1959 - 60

| | | | |
|---|---|---|---|
| 1. | ప్యారీ అండ్ కంపెనీ— మద్రాసు | .... | 240 |
| 2. | శ్రీ పి. యన్. యన్. ప్రసాద్ | .... | 250 |

### జూలై 1958 నుండి జూన్ 1959 వరకు అందిన విరాళాలు

| | | |
|---|---|---|
| 1. | మెస్సర్స్ పొన్నలూరి బ్రదర్సు ప్రసూతి వార్డు నిర్మాణానికి 15,000 విరాళం ప్రకటించి దానిలో అడ్వాన్సుగా యిచ్చినది | 1,116 |
| 2. | శ్రీమతి సూరిరెడ్డి పిచ్చమ్మ- మానికొండ-6 గురు పిల్లల మంచాలు వగైరాలకు | 2,000 |
| 3. | శ్రీమతి అన్నె వెంకటసుబ్బమ్మ | 50 |
| 4. | హుండీ బాక్సు కలెక్షను | 5,590- 68 |
| | ఇతర విరాళాలు | 16,513- 33 |

### గ్రాంటులు

| | | |
|---|---|---|
| 1. | ఆపరేషను థియేటరు, సర్జికల్ వార్డు నిర్మాణార్థం మద్రాసు ప్రభుత్వపు గ్రాంటులో మొదట భాగం | 18,400 |
| 2. | నర్సుల కామన్ హాలు కట్టటానికి కేంద్ర సాంఘిక సంక్షేమ సంస్థ విరాళం | 15,000 |
| 3. | సర్జికల్ వార్డు ఎక్విప్‌మెంటు గ్రాంటు- కేంద్ర ఆరోగ్య శాఖనుండి | 20,000 |

| | | |
|---|---|---|
| 4. | ఆక్సిలరీ, నర్సు, మిడ్ వైఫుల శిక్షణకు కమ్యూనిటీ డెవలప్ మెంటు ప్రోగ్రాం 31-3-1959 వరకు కేంద్ర ఆరోగ్య శాఖ, రికరింగు గ్రాంటు | 61,000 |
| 5. | వెల్ ఫేర్ ఎక్స్టెన్షన్ ప్రాజెక్టు క్రింద ఆక్సిలరీ నర్సుల, మిడ్ వైఫుల శిక్షణకు | 2,500 |
| 6, | కార్పొరేషను- మద్రాసు- కామన్ గుడ్ ఫండు 1956- 57 | 100 |

## ఈశ్వర ప్రసాద దత్తాత్రేయ ఆర్థోపెడికల్ వార్డుకై విరాళాలు

| | | |
|---|---|---|
| 1. | భవన నిర్మాణానికి శ్రీ, శ్రీమతి హనుమంతరావుగార్లు | 1,00,000 |
| 2. | సుందరం మోటార్సు ప్రయివేటు లిమిటెడ్- మద్రాసు | 5000 |
| 3. | శ్రీ సతీవిలాస్ బస్సు సర్వీసు- పొరయూరు | 1000 |
| 4. | రామావిలాస్ బస్సు సర్వీసు ప్రవేటు లిమిటెడ్-కుంభకోణం | 1000 |
| 5. | మెస్సర్స్ రామన్ అండ్ రామన్ ప్రవేటు లిమిటెడ్. కుంభకోణం | 1000 |
| 6. | శ్రీ మహాలింగం, శక్తి నిలయం–పొల్లాచి | 1000 |

## ఆపరేషన్ థియేటర్

మద్రాసు ప్రభుత్వం 1958 లో ఏప్రిల్ నెలలో మనకు శాంక్షన్

| | |
|---|---|
| కేంద్ర ప్రభుత్వం 25-9-57 | 34, 000 |
| 26-3-59 | 20, 000 |

## ఆక్సిలరీ మిడ్ వైఫులకు శిక్షణ 2 సంవత్సరములు

శిక్షణ ప్రారంభం ఆగస్టు 1953 నుండి జూన్ నెల 58 వరకు 100 మందికి శిక్షణ

| | | | | |
|---|---|---|---|---|
| (1) | 1-8-53 నుండి | 31-7-55 | 12 మంది | Passed Health |
| (2) | 15-7-54 నుండి | 16-10-56 | 29 మంది | |
| (3) | 1-8-55 నుండి | 31-7-57 | 15 మంది | |
| C. S. W. | 1-11-55 నుండి | 13-12-57 | 15 మంది | |
| (4) | | 4 వ బేచిలో | 1 అమ్మాయి ప్యాసు కాలేదు. | |
| (5) | 1-8-56 నుండి | 31-7-58 | 3 మంది | |
| (6) | 1-8-57 | 31-7-59 | 15 | |
| | జూనియర్ | | | |
| | 1-12-57 నుండి | 30-11-59 | 15 | |
| (7) | 1-8-58 నుండి | 31-7-60 | 14 | |
| | 1-12-58 నుండి | 30-11-60 | 16 | |

## ఫామిలీ ప్లానింగ్ క్లినిక్ కు

కేంద్ర ప్రభుత్వం వారు 1, 0 5000 గ్రాంటు యిచ్చినారు.

—కార్యదర్శిని
వి. లక్ష్మీపార్వతి

# ఫామిలీ ప్లానింగు వెల్‌ఫేర్ వర్కర్సు

ఆంధ్ర మహిళా సభ నర్సింగ్‌హోములో ఫామిలీ ప్లానింగు వెల్‌ఫేరు వర్కర్ల తర్ఫీదు కేంద్రానికి ప్రారంభోత్సవం జరిగింది. దీనిని ప్లానింగు కమిషను డిప్యూటీ చైర్మన్ కృష్ణమాచారిగారు ప్రారంభించారు. శ్రీమతి ధన్వంతీ రామారావు అధ్యక్షత వహించారు.

కేంద్ర ప్రభుత్వ ప్రోత్సాహంతో ప్రారంభింపబడనున్న మూడు కేంద్రాలలో మహిళా సభ అధ్వర్యం క్రింద పని చేస్తుంది ఈ మద్రాసు లోని సంస్థ. దీనిలో పన్నెండు మాసాలపాటు 50 మందికి తర్ఫీదు ఇవ్వబడుతుంది. ఇటువంటివే నాగపూరులోనూ, అల్హాబాదులోనూ కూడా ప్రారంభింపబడతాయి.

నర్సింగుహోము కార్యదర్శిని శ్రీమతి లక్ష్మీ పార్వతిగారు అతిధులకు స్వాగతం చెప్పారు. కేంద్ర సంక్షేమ సంస్థ చైర్మన్ శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ ఈ సంస్థను గురించి చెప్తూ, యింతవరకూ కుటుంబ నియంత్రణ విషయాలలో సాధించిన అభ్యుదయం జరిగిన కృషిని చర్చించారు. ఇప్పటివరకూ 2వ పంచవర్ష ప్రణాళికా కాలంలో కార్యక్రమాలకుగాను కేంద్రప్రభుత్వం 6 కోట్లు కేటాయించిందనీ, ఆలిండియా ఫామిలీ ప్లానింగు బోర్డు, రాష్ట్రబోర్డుల స్థాపనలను గురించి వివరించారు.

తర్ఫీదు నందిన వెల్‌ఫేరు వర్కరు యిటు డాక్టరుకీ, అటు డాక్టరు అవసరం వున్న వ్యక్తికీ మధ్యవర్తిగా వుంటూ కార్యక్రమ విజయానికి పాటుపడుతుంది. కేంద్ర ప్రభుత్వం యీ తర్ఫీదు కాలంలో విద్యార్థులకి ఉచిత వేతనాలు యిస్తుంది. రెండవ ప్రణాళిక కాలంలో 2000 పల్లె ప్రాంతాలలోనూ, 500 పట్న ప్రాంతాల లోనూ ఫామిలీ ప్లానింగు క్లినిక్కులకు ప్రారంభం జరగాలని పట్న ప్రాంతాలలో ఈ మొత్తం పూర్తి అయినా పల్లె ప్రాంతాలలో మటుకు ఈ క్లినిక్కులు విజయవంతంగా సాగలేదు. ప్రాధమిక ఆరోగ్య కేంద్రాల స్థాపనకీ యీ క్లినిక్కులకీ లంకె వేయడంవల్ల యిలా జరిగిందేమో అనీ, వీటిని విడి విడిగా అమలు జరిగితే మంచిదా అన్న విషయాలు ఆలోచనలో వున్నాయనీ శ్రీమతి దేశ్‌ముఖ్ అన్నారు. సేవచేయడానికి మనుషులను చేరదీయడంలో గల కష్టనష్టాలను గురించి ప్రస్తావిస్తూ, తర్ఫీదునివ్వగల్గిన సంఖ్య చాలా తక్కువ అనీ యీ తర్ఫీదు కాలంలో వీరికి హాస్టలు వసతులు కల్గించవలసి వుంటుందనీ అన్నారు.

శ్రీమతి ధన్వంతీ రామారావు మాట్లాడుతూ ఆంధ్రమహిళాసభ వారు నిర్వహిస్తూవున్న అనేక సేవా కార్యక్రమాలని మెచ్చుకున్నారు. శ్రీమతి దుర్గాబాయిగారి శ్రమకీ వారిచుట్టూవున్న నమ్మికైన సేవికలకీ యీ ఘనత దక్కుతుంది అన్నారు.

కుటుంబ నియంత్రణ కార్యక్రమాలు తర్ఫీదు నందిన సేవికలు లేకుంటే విజయివంతంగా కొనసాగవనీ యీ అవసరం చాలా రోజులనుండీ వుందనీ అన్నారామె. యీ కార్యక్రమం-తల్లీ బిడ్డల ఆరోగ్యం దృష్ట్యానూ, ఆర్థికమైన అవసరాల దృష్ట్యానూకూడ యీ కార్యక్రమం తప్పక విజయం కావాలి. భారత ప్రభుత్వం యీ విషయంలో శ్రద్ధ వహించడం ముదావహం. యీ విషయంలో కార్యక్రమం శీఘ్రంగా నడిపించడానికీ, విస్తారమైన ప్రచారం సాగించడనికీ, వేల సంఖ్యలో ప్రచారకులు కావాలని అన్నారు శ్రీమతి రామారావు.

తరువాత శ్రీ వి. టి. కృష్ణమాచారిగారు ప్రసంగిస్తూ, భారత ప్రభుత్వం ఫామిలీ ప్లానింగు తన పోలసీగా స్వీకరించింది; దానికి సంబంధించిన కార్యక్రమాలన్నీ మహిళా స్వచ్ఛంద సేవా సంస్థల చేతులలో నుంచి. [illegible]

సహాయ సహకారాలను యివ్వడం ప్రభుత్వం చేయతగ్గపని. ఆర్థిక ఆరోగ్య కారణాల వల్ల ఫామిలీ ప్లానింగు మనదేశంలో అతి ముఖ్యమైన సమస్య అయిందనీ, యీ ప్లానింగు వెల్‌ఫేరు వర్కర్ల తర్ఫీదు కేంద్రం ప్రారంభింపబడ్డ హర్షింపతగ్గదనీ అన్నారు.

మద్రాసు శాసనసభ స్పీకరు శ్రీ కృష్ణారావు గారు ప్రసంగించుతూ, 1947-48 నాటినుండి యీనాటి వరకూ కుటుంబ నియంత్రణ విషయాలు చాలా ముందుకి వచ్చాయనీ దానికి కారణం మొక్కవోని ఉత్సాహం తో పనిచేసే శ్రీమతి ధన్వంతీరామారావు వంటి అమూల్యమైన వ్యక్తులనీ అన్నారు. ఇటువంటి కార్యక్రమాల నిర్వహణ అవసరాన్ని విపులీకరిస్తూ, కుటుంబ నియంత్రణ అంటే ఆరోగ్య వంతమైన పిల్లలను తగినంత వయస్సు తేడాలలో కని పెంచడం అన్నారు. ఈ రంగంలో పనిచేసే సేవికలు ధైర్యసాహసాలు కలవారుగనూ, మాట నేర్పరులుగానూ వుండాలని అంటూ వీరు "మానవ దృష్టిని" అవలంబించాలి అని అన్నారు.

డాక్టరు శ్రీమతి వేదమాణిక్యం సభతరఫున వందన సమర్పణ చేశారు.



# కృతజ్ఞత

శ్రీమతి ధనలక్ష్మి నహాతా

శ్రీమతి శాంతిబెన్ పాపట్‌లాల్ గారలు చెరియొక 500 యిచ్చి సభకు పోషకులైనారు

శ్రీమతీ పల్లంరెడ్డి యశోదమ్మగారు.

శ్రీమతి జయలక్ష్మి అమ్మాల్‌గారు చెరియొక నూరు రూపాయలిచ్చి సభకు యావజ్జీవ సభ్యులైనారు. వారికి మాకృతజ్ఞత.



# రాకుమారి వెన్ చెంగ్

ఏడవ శతాబ్దంలో టిబెట్టు రాజు స్రోన్ త్స్వన్ గంపోకు టాంగ్ రాజ వంశానికి చెందిన రాకుమారి వెన్ చెంగ్‌ను ఇచ్చి వివాహం చేసినప్పుడు చైనీస్ సిల్కు గుడ్డల్ని 'ఆర్టు' కాగితాన్ని సిరా తయారు చేసే ప్రవీణులను వ్యవసాయ ప్రవీణులను రాకుమారికి అరణంగా ఇచ్చి పంపించడం జరిగింది. చారిత్రాత్మకమైన యీ కలకయి హాన్ జాతీయులకూ టిబెట్ ప్రజలకూ మధ్య స్నేహ సంబంధాలను బలపర్చింది. టిబెట్ ఆర్థిక విధానంపైనా, సంస్కృతిపైనా గొప్ప ప్రభావాన్ని కలుగజేసింది యీ వివాహం.

రాజ వంశాల మధ్య యేర్పడిన యీ కలయికను గురించి టిబెట్ ప్రజల నేటికి గూడా యెన్నెన్నో కథలను చెప్పుకొంటుంటారు. స్రోన్స్త్వన్ గంపో తన భార్య గౌరవార్థం లాసా నగర మధ్య సంస్థలలో జాఫూన్ ఆరామాన్ని నిర్మించాడు. బహు సుందరమైన యీ కట్టడం చాలా ప్రఖ్యాతిని గాంచింది. స్రోన్స్త్వన్ గంపో బలవంతుడైన రాజు. తన రాజ్యాన్ని చక్కగా పాలిస్తుండే వాడు. తన దేశంలోని వివిధ తెగలను ఒకే జాతిగా ఐక్యపర్చి, తర్వాత టాంగ్ రాజ వంశంలో వియ్యం పొందాడు. చైనా దేశ మహా నాగరికతను సవరించుకొన్నాడు.

ఈ టిబెటియన్ రాజు నూనూగు మీసాల నూత్న యౌవనంలో ఉండగా చైనా దేశపు లైట్సుంగ్ మహా రాజు సోదరుని కుమార్తె యొక్క ముగ్ధసౌందర్యాన్ని గురించి విన్నాడు. ఆమెను పరిణయమాడాలని యెందరెందరో రాజులు ప్రయత్నించారు. కాని చైనీస్ మహా రాజు ఆమెను అత్యంత ప్రతిభా వంతుడు, వివేకవంతుడు అయిన వానికే ఇచ్చి వివాహం చేస్తానని ప్రకటించాడు. కాని టిబెటియన్ రాజు యే మాత్రము వెనుకాడకుండా తన మంత్రి గువెర్‌కు వంద మంది యోధులను తోడుగా యిచ్చి చైనీస్ మహారాజుకు తన ఆకాంక్షను తెలియజేయను పంపించాడు. గువెర్ తన వెంట ముత్యాలు, వజ్రాలు, బంగారం మొదలైన విలువగల వస్తువులను కానుకలుగా పట్టుకొని బయలుదేరాడు.

గువెన్, అతని అనుచరులు యెన్నెన్నో కష్టాలను యెదుర్కొని చిట్టచివరికి చైనా రాజధాని చాంగన్‌కు చేరుకొన్నారు. ఇటువంటి సందేశాలలోనే మరి నాలుగు రాయబారి వర్గాలు వచ్చి అప్పటికే రాజధానిలో ఉన్నాయి. అందువల్ల లైట్సుంగ్ మహారాజు వచ్చిన ఐదుగురు రాయబారుల మధ్య పరీక్ష పడతాననీ, అందరిలో తెలివైన రాయబారి యజమానికే రాకుమారి వెన్ చెంగ్‌ను ఇచ్చి వివాహం చేస్తాననీ అన్నాడు.

మహారాజు వంకర టింకరగా మధ్య రంధ్రం ఉన్న గుండు రాయంత ముత్యాన్నొక దానిని తెప్పించి అందులో దారం యెక్కించమన్నాడు. మొదటి నలుగురు దారం యెక్కించలేక పోయారు. తర్వాత గువెన్ వంతు వచ్చింది. గువెన్ ఒక చీమను తీసుకొని వచ్చి దానిని నడుముకు దారాన్ని కట్టాడు. అలా దారాన్ని కట్టిన చీమను ముత్యపురంధ్రంలో ఉంచి మూడు సార్లు నోటిలో ఊదాడు. చీమ నెమ్మదిగా రంధ్రం గుండా ప్రాకుకొంటూ రెండవ వైపు నుండి దారంతో సహా వచ్చింది.

తర్వాత మహారాజు వంద ఆడు గుఱ్ఱాల నుండి వాటి దూడలను వేరు చేయించి, ఏయే దూడలు ఏయే గుఱ్ఱాలవో కనిపెట్టమని ఆ ఐదు గురు రాయబారులనూ కోరాడు. మొదటి నలుగురు రాయబారులు గుఱ్ఱాల రంగులనూ, లక్షణాలనూ, దూడల రంగులనూ, లక్షణాలను యెంతో శ్రద్ధగా పరిశీలించి చూస్తూ ఏయే దూడలు ఏయే గుఱ్ఱాలవో కనిపెట్టడానికి విశ్వ ప్రయత్నాలు చేశ్తారు. కాని యేమీ లాభం లేకపోయింది. ఇలా వాళ్ళు ప్రయత్నిస్తున్న సమయంలో గువెన్ వెళ్ళి గుఱ్ఱాల కాపరితో బాతాఖానీ ప్రారంభించాడు. గుఱ్రాల కాపరి గువెన్ నిరాడంబరత్వానికి చాలా సంతోషపడి అతనికి ఒక చిన్న సలహాను ఇచ్చాడు. ఇలా సలహాను పొందిన గువెన్ తన వంతు వచ్చి నప్పుడు ఆ రాత్రికి గుఱ్ఱపు దూడలనన్నింటినీ వేరుగా కట్టివేసి పొడి సెనగలను మాత్రమే వాటికి పెట్టి, నీటిని ఒక్క చుక్కయినా త్రాగ నివ్వ వద్దన్నాడు. మర్నాడు ఉదయమే ఆ గుఱ్ఱపు దూడలను విప్పేటప్పటికే ఏ గుఱ్ఱపు దూడలు ఆ గుఱ్ఱం దగ్గరకు చేరుకొని పాలు త్రాగ సాగాయి.

ఇలా మొదటి రెండు సమస్యలను ఒక్క గువెన్ మాత్రమే తీర్చగలిగాడు. తర్వాత చివరి పరీక్షవచ్చింది మహారాజు రాకుమారి వెన్ చెంగ్‌తోపాటు ఆమె చెలికత్తెలను రెండు వందల యాభై మందిని రాకుమారిలాగే ఒకే విధమైన దుస్తులు, ఒకే విధమైన నగలతో అలంకరింప జేసాడు. ఆ సుందరాంగులలో రాకుమారి యెవరో కనిపెట్టమని మహారాజు రాయబారు లను అడిగాడు. ఎంత పరీక్షగా చూచినా ఆ సుందరాంగులలో రాకుమారి యెవరో కనిపె ట్టడం గువెన్‌కు కూడా చాలా కష్టమయి పోయింది. అప్పుడు గువెన్‌కు తాను విడిదిచేసిన గృహయజమాని భార్య ఒకప్పుడు రాకుమారికి చెలికత్తెగా పనిచేసిందన్న విషయం జ్ఞాపకానికి వచ్చింది. గువెన్ ఆమెసహాయాన్ని అర్థించాడు. స్రోప్త్స్యాన్ గంపో సద్గుణాలను గురించి వినివున్న ఆమె రాకుమారిని యెలా గుర్తించాలో తెలి యజేసింది. అతను రాజభవనానికి వెళ్ళి ఆ సుందరాంగులలో ఒకతెను రాకుమారిగా గుర్తించాడు. ఆవిడ బుగ్గపైన ఒక మచ్చగుర్తు కుడి బుగ్గపైన ఒక పద్మం గుర్తు ఉన్నాయి. నొసటిమధ్య ఒక ఎర్రనిచుక్క. దానిలో ఒక సూక్ష్మమైన బుద్ధుని విగ్రహము వునాయ్ను.

టిబెట్ రాజు తన రాయబారిని యెన్నుకొన డంలో యెంతటి వివేకాన్ని చూపాడో గువెన్ తెలివి తేటలవల్ల మహారాజుకు రుజువయింది. రాకుమారి వెన్‌చెంగ్‌ను టిబెట్‌కు సాగనంప డానికి యేర్పాట్లను చేయమని తైట్సుంగ్ మహారాజు ఆజ్ఞాపించాడు. గృహోపకరణ వస్తు వులు, విలువైన మూలికలు, ఖనిజాలు, చైనీస్ మహాకావ్యాలు చరిత్ర గంథాలు, సాంకేతిక కళలు, చేతిపనులకు సంబంధించిన గ్రంథాలు, వివిధరకాల వాద్యాలు. వరి, గోధుమమొక్కలు పట్టుపురుగుల గుడ్లు. సుందమైన ఒక బుద్ధ విగ్ర హము రాకుమారికి అరణంగా టిబెట్‌కు పంప బడ్డాయి. అనేకమంది సేవకులు, చేతిపనుల ప్రవీ ణులుగూడా వెంట వెళ్ళారు.

లాసాకు చేరుకున్న తరువాత రాకుమారికి స్రోప్త్స్యాన్ గంపోకు క్రీ॥ శ॥ 641 లో వైభవంగా వివాహం జరిగింది. చాలా సంవత్సరాలపాటు జీవితాన్ని ఆనందంగా గడిపారు. ఉభయులు టిబెట్ ప్రజల సంక్షేమం కోసం తమ శక్తి నం తాధార బోసి పనిచేశారు. రాకుమారితో పాటు టిబెట్‌కు వచ్చిన హాన్‌జాతి ప్రవీణులు టిబెట్ ప్రజలకు నేద్యం సేయడం, వ్యవసాయ పనిముట్లను చేసుకోవడం, బట్టలునేయడం, భవ నాలను నిర్మించడం, కాగితాన్ని తయారుచేయ డం, లోహపు వస్తువులను తయారు చేయడం మొదలైన పనులను నేర్పారు.

జాఖాన్ బౌద్ధ ఆరామము నిర్మింప బడుతున్న కాలంలో ఒకనాడు రాకుమారి వెన్ చెంగ్ అక్కడికి చూడడానికి వెళ్ళిందట. పనిచేస్తున్న కార్మికులంతా ఆమె సౌందర్యాన్ని చూచి మంత్ర ముగ్ధులై పోయినట్లు అలానే ఉండిపోయారట. సింహద్వారం కోసం సింహాలను చెక్కుతున్న ప్రధాన శిల్పి మైమరచి పోవడం వల్ల చేయి పొరపడి సింహం ముక్కును విరగ్గొట్టేసాడట. అందువల్లనే మనకు ఆ ఆరామంలోని సింహ విగ్రహాలకు ముక్కులు కనబడవు.

జాఖాన్ బౌద్ధ ఆరామ నిర్మాణం పూర్తయినతరువాత రాకుమారి వెన్ చెంగ్ తనవెంట చైనానుండి తీసుకువచ్చిన బుద్ధ విగ్రహాన్ని అందులో ప్రతిష్ఠింపజేసి, పూజించడం ప్రారంభించింది. తరుచు రాకుమారి జాఖాన్ ఆరామానికి వచ్చి టిబెట్ ప్రజలకు తన మాతృభూమిని గురించీ, ఆ దేశపు ప్రజల జీవిత విధానాలను గురించీ ఉపన్యసిస్తుండేదట. ఆమెకు బౌద్ధమతంలోగల గట్టి విశ్వాసం ఫలితంగా స్రోన్త్స్యన్ గంపోకూడా విశ్వాసం యేర్పడింది దాని ఫలితంగా బౌద్ధమతం టిబెట్‌లో బాగా ప్రచారమయింది. ఈ నాటికీ టిబెట్‌లోని బౌద్ధమతస్థులు సంవత్సరానికొకసారి జాఖన్ బౌద్ధ ఆరామానికి యాత్ర వెళుతుంటారు. రాకుమారి వెన్ చెంగ్ తాను స్వయంగా అక్కడ నాటిన విల్లో చెట్లను దర్శించుకొని వస్తూంటారు.

టిబెట్ ప్రజలకు ఒక అక్షరమాలను సృష్టించి, వ్రాత భాషను రూపొందింప జేయుమనికూడా ఆమె స్రోన్త్స్యన్ గంపోకు సలహానిచ్చింది.

రాకుమారి వెన్ చెంగ్‌కూ, స్రోన్త్స్యన్ గంపోకు జరిగిన వివాహం ద్వారా హాన్ జాతి వారితో టిబెట్ ప్రజలమధ్య స్నేహసంబంధాలు బలపడ్డాయి.

అది మొదలుకొని యీ రక్తసంబంధాలు నానాటికి బలపడుతూనే ఉన్నాయి.



జూలై నాల్గవ తేదీ అమెరికన్ స్వాతంత్ర్య దినం :

# అమెరికన్ స్వాతంత్ర్య యోధులు

అది 1776 వ సంవత్సరం జూలై మాసంలో రెండవ రోజు- మంగళ వారం. ఫిలడెల్ఫియా (పెన్సిల్వేనియా) ప్రభుత్వ భవనం మీద మేఘాలు అలముకొన్నవి. ఎత్తయిన దాని గోపురంలో ఒక గంట వ్రేలాడుతున్నది. ఆ గంట మీద "భూమండలంలోని ప్రజలందరికీ స్వాతంత్ర్యం ప్రకటించండి" అని ఉల్లేఖించబడి ఉన్నది. పవిత్ర గ్రంథం (బైబిలు) లోని ఈ దివ్య వాక్యం భవిష్యత్తును వినిపిస్తున్నది. నాడు ఇక్కడ 13 అమెరికన్ కాలనీల ప్రతినిధులు బ్రిటన్ నుంచి విముక్తి పొంది "స్వాతంత్ర్య ప్రకటన" చేయటానికి సమావేశమైనారు. ఈ 13 కాలనీల చరిత్రలో అపూర్వమైన ఒక ముఖ్య తీర్మానం మీద ఓటు చెయ్యటానికి వారక్కడ కూడారు.

వర్జీనియా ప్రతినిధి రిచర్డ్ హెన్రీలీ ఈ తీర్మానం ప్రతిపాదించాడు. "సంయుక్త రాష్ట్రాలు స్వేచ్ఛా స్వాతంత్ర్య రాష్ట్రాలుగా ఉండే హక్కు కలిగినవై బ్రిటీషు రాచరికంతో తమకున్న అన్ని సంసంధాలను తెగతెంపులు చేసుకొని, విముక్తి పొంది, బ్రిటనుతో గల ఈ అన్ని రాజకీయ సంబంధాలను పూర్తిగా రద్దు గావించుకోవటమైనది."

సమావేశమంతా సంశయ వాతావరణం క్రమ్మింది. 13 కాలనీల స్వాతంత్ర్యానికి ఏక గ్రీవంగా వోటు చేస్తాయా? పోలింగ్ వేళ సమీపించేకొద్దీ ప్రతినిధులలో ఆత్రుత జాస్తి అయింది. న్యూయార్కు, పెన్సిల్వేనియా, దక్షిణ కెరోలీనా, ప్రతిఘటించినవి, ఆ రాష్ట్రాలు విప్లవాన్ని వ్యతిరేకించినవి.

విప్లవం పట్ల తీవ్ర సందేహం వెలిబుచ్చినవి. ఈ కీలక సమయంలోనే జనరల్ వాషింగ్టన్ నుంచి ఒక సందేశం వచ్చింది. (న్యూయార్క్ సమీపాన బ్రిటీషు సేనలతో జరిగే పోరాటానికి నాయకత్వం వహించింది ఈయనే.) ఆ సందేశంతో గాలి విప్లవవాదుల వైపు మ్రొగ్గింది. న్యూయార్కు రేవులో బ్రిటీష్ నౌకలు మూడు, నాలుగు దాకా కనపడుతున్నవనీ, దారి తప్పక పోవచ్చుననీ. ఈ ఆపదను అధిగమించటానికి తమ యావచ్ఛక్తులను ఒడ్డవలసి ఉంటుందనీ వాషింగ్టన్ తన సందేశంలో తెల్పాడు. ఈ విధంగా ముంచుకవస్తున్న ప్రమాదంలో-అటూ-ఇటూ ఊగుతున్న వారిని విప్లవం వైపుకు మ్రొగ్గించింది.

తీర్మానానికి అనుకూలంగా వోటు చేయటానికి ఇష్టంలేని ఇద్దరు పెన్సిల్వేనియా ప్రతినిధులు, తమ రాష్ట్ర ప్రతినిధివర్గంలో విభిన్నాభిప్రాయాన్ని తొలగించే ఉద్దేశంలో స్టేటు హౌసు వెలుపలే ఉండిపోయారు. న్యూయార్కు ప్రతినిధి వర్గం కెరోలీనా ప్రతినిధివర్గం నిజమైన సహకార ధోరణి ప్రదర్శించాలనే తత్వంతో చివరి నిమిషంలో తీర్మానానికి అనుకూలంగా వోటు చేసింది. అందులో పాల్గొన్న 12 కాలనీల స్వాతంత్ర్యానికి ఏక గ్రీవంగా వోటు చేసినవి.

తీర్మానం ఆమోదించబడిన వెంటనే థామస్ జెఫర్సన్ రూపొందించిన స్వాతంత్ర్య ప్రకటన ముసాయిదాను కాంగ్రెసు చర్చకు తీసుకున్నది. ఆ ప్రకటన ఇది.

"మానవ జాతి పరిణామంలో ఒక దేశ ప్రజలు మరొక దేశంతో ఉన్న సంబంధాలను రద్దు చేసుకోవలసిన అవసరం, తద్వారా ప్రకృతి ధర్మాలు, ప్రకృతి దైవం ప్రసాదించే- పృథ్వీతలం మీది దేశాలతో సమానంగా- ప్రత్యేక హోదా సంపాదించటం అవసరమైనప్పుడు

ప్రత్యేక ప్రతిపత్తికి తమను ప్రేరేపించే కారణాలను వారు మానవజాతి అభిప్రాయాలను ఉదాత్తంగా గౌరవించేలాగా ప్రకటించుకో వలసి ఉన్నది.

"మానవులంగా సృష్టిలో సమానులేననీ, వారికి భగవంతుడు కొన్ని తిరుగులేని హక్కులు ప్రసాదించాడనీ, జీవించటం, స్వేచ్ఛ, సౌఖ్యాన్వేషణ, వగైరా ఈ సత్యాలు స్వయం సాక్షీభూతాలని మేము నమ్ముతున్నాము. ఈ హక్కుల భద్రతకు పాలితుల అభీష్టానుసారంగా న్యాయమైన అధికారాలతో ప్రజలనుండి ప్రభుత్వాలు ఏర్పాటైనవి. ఎప్పుడైనా ఏ ప్రభుత్వమైనా ఈ లక్ష్యాలను హరించేదిగా తయారైనప్పుడు, దీన్ని మార్చగలిగ, లేదా రద్దుచేయగలిగిన హక్కు దీని స్థానే కొత్త ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకోగలిగిన హక్కు ప్రజలకున్నది. తమ క్షేమ, సౌఖ్యాలకై కృషి చేయగలిగే విధంగా పునాదులు వేసుకొని, అటువంటి సూత్రాల మీద దాని అధికారాలను రూపొందించి అట్టి ప్రభుత్వాన్ని ప్రజలు ఏర్పాటు చేసుకొనే అధికారం వారికి ఉన్నది. నిజానికి వివేకవంతమైన విధానాల మీద ఏర్పడిన ప్రభుత్వాలను తేలికైన, తాత్కాలిక కారణాలతో మార్చకూడదు..."

1776 జూలై 3 వ తేదీ రాత్రి వరకూ కాంగ్రెసులో ఏకాభిప్రాయం కుదరలేదు. మరునాటి దాకా చర్చ సాగింది. గురువారం-జూలై 4 వ తేదీన అంతా శుభాంతమైంది. ఉదయం 9 గంటలకు కాంగ్రెసు సమావేశమైనప్పుడు ప్రెసిడెంట్ హాన్‌కాక్ సమావేశం ప్రారంభించగానే తిరిగి వివాదం చెలరేగింది. సాయంకాలం దాకా వాదోపవాదాలు జరుగుతూనే ఉన్నవి. 'ఆ చర్చల ధోరణి చూస్తే వాటికి అంతం లేనట్లు కనపడింది" అని జెఫర్సన్ తరువాత వ్రాశాడు. "వాతావరణం నిప్పులు చెరుగుతున్నది. ప్రతినిధులు ఉన్న గది ఒక గుర్రాల శాల, చోమార్లు, ఈగలు-మునిగాళ్ళమీద నిలబడి వాదించుకుంటున్న ప్రతినిధులపై ముసురుకొని సన్నని మేజోళ్ల గుండా పొడిచి చంపుతున్నవి" అని వర్ణించాడు జెఫర్సన్.

సాయంకాలానికి తిరిగి హాన్‌కాక్ అధ్యక్ష పీఠం అలంకరించాడు. వర్జీనియా ప్రతినిధి బెంజిమిన్ హారిసన్ ప్రకటన ముసాయిదాను కమిటీ ఆమోదించినదని ప్రకటించాడు. ఆ పత్రాన్ని మరొకసారి చదివారు. దానికి ఏకగ్రీవంగా వోటు చేశారు.

1776 జూలై 4వ తేదీన కాంగ్రెసు సభ్యులు పక్షాన స్వాతంత్ర్య ప్రకటన చదివినవారు జాన్ హాన్‌కాక్. అప్పటికే అలసిపోయిన ప్రతినిధు ప్రకటన కాపీలను తక్షణమే ఆరాత్రే ప్రింటు చేయాలని, యునైటెడ్ స్టేట్స్ ప్రతి రాష్ట్రంలోనూ స్వాతంత్ర్య ప్రకటన జరగాలనీ, తాకీదు యిచ్చాడు.

ప్రభుత్వ భవనం గోపురపు పెద్ద గంట గణగణ మ్రోగింది. ప్రేక్షక సమూహంనుంచి జయ జయ ధ్వానాలు మిన్ను ముట్టినవి. ఫిరంగులు ప్రేలినవి. నాగారా మ్రోగింది. "దేశమంతటా స్వాతంత్ర్యం ప్రకటిస్తూ" చర్చి గంటలు మ్రోగినవి.

జూలై 19వ తేదీన స్వాతంత్ర్య ప్రకటనను చర్మ పత్రంమీద ఉల్లేఖించి ప్రతినిధులచేత సంతకాలు చేయించవలసిందిగా తాకీదులు జారీ అయినవి. సంతకాలు జరిగింది. ఆగస్టు రెండవ తేదీన ఈ ఉత్సవానికి సభ్యులు హాజరైనప్పుడు రోడ్ ఐలండ్ ప్రతినిధి ప్రతిఒక్కరు సంతకం చేసే తీరును పరిశీలించాలని అందుకు చక్కని ప్రదేశాన్ని ఎంచుకున్నారు. ఈయన విద్యాధికుడైన చతురుడు. తన సహ సభ్యులు కాంగ్రెసులో ప్రసంగిస్తూ ఉండేవారు. మాట్లాడే తీరు తెన్నులపై ప్రహసనాలు వ్రాశాడు.

"ఆ పత్రంమీద సంతకాలు చేసేటప్పుడు వాళ్ళు ఎట్లా కనపడతారో, వాళ్ళ ముఖ కవళికలు ఎట్లా ఉంటవో, చూడాలనుకున్నాను. అది వాళ్ళ మరణ పత్రం వంటిది. ప్రతి ఒకరి ముఖంలోనూ అకుంత దీక్ష తాండవించింది." అన్నారాయన.

జాన్ హాన్‌కాక్ పెద్ద పెద్ద అక్షరాలతో తన పేరు చెక్కాడు. ఇట్లా అన్నాడు. "జాన్ బుల్ కళ్ళద్దాలు లేకుండానే ఇది చదవవచ్చు. నా బుర్రకు ఇస్తానన్న తన బహుమానం 500 పౌన్లు రెట్టింపు చెయ్యవచ్చు. ఇదే నా సవాలు" అన్నాడాయన.

హాన్‌కాక్ సంతకాన్ని తలదన్నేదిగొగ్గిరి గొగ్గిరిగా ఉండే స్టెఫెన్ హాప్కిన్స్ (రోడ్ ఐలండ్ ప్రతినిధి) సంతకం. ఈయన పక్షవాత రోగి. అయన పత్రంమీద సంతకం చేసి వ్రాసే ఈకను ప్రక్క సభ్యునికిస్తూ గంభీరంగా ఇట్లా అన్నాడు "నా చెయ్యి అయితే ఒణుకుతుందే కాని హృదయం చలించదు."

తతిమ్మా సభ్యులు చేసేటప్పుడు ఇట్లా అన్నాడు. "మనం అంతా సమైక్యంగా ఉండాలి, అటూ ఇటూ లాగకూడదు. మనందరమూ చచ్చినా ఒకేసారి చావాలి."

అందుకు డాక్టరు ఫ్రాంక్లిన్ ఇట్లా జవాబి చ్చాడు. "ఔను మనందరం ఒకేసారి ఉరేసుకోవాలి. లేదా కనీసం మనందరం వేరు వేరుగానైనా సరే నమ్మకంగా ఉరేసుకోవాలి."

ఈ స్వాతంత్ర్య ప్రటనమీద మొత్తం 56 మంది సంతకాలు చేశారు. అందమైన ధన్యమైన, ప్రపంచంలో అమాంతంగా నిలచిపోయిన ఆ మహా పత్రం మీద సంతకాలు పెట్టిన ఈ మహామహులు ఎటువంటివారు?

ఈ 56 మంది "మహామహుల"లో హెచ్చు మంది యువకులు, పటుత్వంగలవారు. వారిలో ఏడుగురు మాత్రమే అరవయ్యోపడి దాటిన వారు. 18 మంది ముప్పై, నలభై లోపువారే. ముగ్గురు ఇరవై – ముప్పై సంవత్సరాల మధ్య ప్రాయం గలవారు. ఒక్కరికీ గడ్డంలేదు. మీసాలు లేవు. ఇద్దరు బ్రహ్మచారులు.

వారిలో మేధావి బెంజమిన్ ఫ్రాంక్లిన్‌కు 70 సంవత్సరాలు. ఈయన పెన్సిల్వేనియా ప్రతినిధి. కొలదిమంది వృద్ధ కాంగ్రెసు సభ్యులలో ఈయన ఒకరు.

మేసచుసెట్సు ప్రతినిధి జాన్ అడమ్స్ తొలి అమెరికన్ వైస్ ప్రెసిడెంట్ అయ్యారు. తర్వాత రెండవ ప్రెసిడెంటుగా వైట్ హౌస్‌లో అడుగిడినాడు.

జఫర్‌సన్‌కు 33 సంవత్సరాలు. ఈయన పట్ల అందరకూ గౌరవముండేది. అందుకే ఈయన్ను కాలిసీల స్వాతంత్ర్య ప్రకటన ముసాయిదా తయారు చేయటానికి ఎన్నుకున్నారు. పొడవుగా వుంటాడు. శరీరంమీద మచ్చలు, తెల్లని వెంట్రుకలు, ఈ వర్జీనియా సభ్యుడంటే అందరికీ అభిమానం. ఆయన మితభాషి అమిత సిగ్గు ఉపన్యాసంచేతకాదు. తాను కాంగ్రెసులో ఉన్న సంవత్సరమూ ఒక్కసారి కూడా మాట్లాడటానికి ప్రయత్నించిన పాపాన పోలేదు. అయితే కలం ఆయనకు బానిస. జఫర్సన్ ప్రసిడెంట్ అడమ్సు క్రింద వైస్ ప్రసిడెంటుగా ఉన్నారు. ఆయన (అడమ్సు) తర్వాత ప్రసిడెంట్ అయినాడు.

వెల వెల పోతున్నట్టు కనబడే దుస్తులు వేసుకునే శ్యామూల్ అడమ్సు జాన్ ఆడమ్సుకు దగ్గిరబంధువు. అతని సహ ప్రతినిధి. మేసచుసెట్సు ప్రతినిధి స్ఫురద్రూపి అయిన జాన్ హాన్‌కాక్ లాగా ఈయన భయపడడు. వీళ్ళిద్దరూ

ప్రాణ స్నేహితులు. వీళ్ళిద్దరి తలల మీద 500 పౌనుల బహుమానానికి సంబంధించిన బాండు ఒకటున్నది.

మేసచుసెట్సు నుంచి జాన్ అడమ్స్ కాక ఒక గొప్ప న్యాయవాది రాబర్ట్ టి. పెయిన్ శామ్యూల్ అడమ్సు కూడా ఉన్నారు. ఈ ముగ్గురూ హార్వర్ పట్టభద్రులు. జాన్ అడమ్స్ శ్యామ్యూల్ అడమ్స్ ప్రభృతులు కంటే పెయిన్ యింకా మితంగా వుంటాడు. అయితే స్వాతంత్ర్యాన్ని బలపరచటంలో ఆయన పట్టు దలగల మనిషి.. ఫిరంగులు, తుపాకి మందు సేకరించటంలో ఆయన జనరల్ వాషింగ్‌టన్‌కు కుడి భుజంగా వున్నాడు.

1824 వ సంవత్సరం, జూలై 4 వ తేదీన జరిగిన 50 వ స్వాతంత్ర్య వార్షికోత్సవంనాటికి నాడు స్వాతంత్ర్య ప్రకటన మీద సంతకాలు చేసిన ఈ 56 మంది ప్రముఖులలో ముగ్గురు చార్లెస్ కెరోల్, జాన్ అడమ్స్ థామస్ జఫర్‌సన్ పాత్రమే మిగిలివున్నారు. ఆ అర్ధ శతాబ్ది ఉత్సవాలలో పాల్గొనవలసినదిగా వాషింగ్టన్ మేయరు ఈ ముగ్గురుకూ ఆహ్వానాలు పంపాడు. అప్పటికి 91 సంవత్సరాల వయోవృద్ధుడైన జాన్ అడమ్స్‌కు ఆ ఉత్సవాలలో పాల్గొనే ఓపిక లేదు. ఆయనకంటే ఎనిమిది సంవత్సరాలు చిన్న అయిన జఫర్‌సన్ మాంటిసెటోలో మరణశయ్యమీద వున్నాడు. విచిత్రంగా, ఈ స్వాతంత్ర్య యోధులు ఇద్దరూ కొన్ని గంటల తేడాలో ఒకేరోజున 1826 జూలై 4వ తేదీ స్వాతంత్ర్య దినోత్సవం నాడు కన్నుమూశాడు.

జఫర్‌సన్ తన తుది లేఖను వాషింగ్టన్ మేయరు ఆహ్వానానికి జవాబుగా 1826 జూన్ 24వ తేదీన వ్రాశాడు ఆ లేఖ ఇది.

"కత్తి పట్టటమో, లేక పరాజయాన్ని అంగీకరించటమో తేలిపోయే అనాడు సాహసోపేతమైన, సందేహాస్పదమైన ఎన్నికనాడు కూడిన మాలో ఆనాడు మేము చేసిన నిర్ణయాల మేరకు ఈ యాభై సంవత్సరాల అనుభవం, అభ్యుదయం తర్వాత శేషించిన కొద్ది మందిని నేను మహదానందంలో కలుసుకొని ఉండే వాణ్ణి... మానవ సత్వాలను గురించి అందరి నేత్రాలు తెరిపిడి పడినవి... ఈ స్వాతంత్ర్య వార్షిక దినోత్సవం ఈ సత్వాలను గురించి- మన పూర్వ స్మృతులను ఎల్లకాలం మెుక్కపోని భక్తితో మనసు చేసుకుందాము."(క. క. మగ్గల్)



# సర్. ఎస్. రాధాకృష్ణన్

జూలై 28 సాయంత్రం ఆంధ్రమహిళా సభ నర్సింగుహోము ప్రాంగణంలోనే ఆపరేషన్ థియేటరుకీ సర్జికల్ వార్డుకీ ప్రారంభోత్సవం జరిగింది. ఈ శుభముహూర్తానికి భారత ఉపాధ్యక్షులు సర్. ఎస్. రాధాకృష్ణన్ ఆహ్వానింపబడ్డారు.

నర్సింగుహోము ఆవరణ అంతా అందంగా అలంకరింపబడింది. శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ ప్రభృతులు ఉపాధ్యక్షులకు యితర ప్రముఖులకూ నర్సింగుహోము చూపించారు మంగళవాద్యాల మధ్య శ్రీ రాధాకృష్ణన్ దీపం వెలిగించి భవనాలకి ప్రారంభోత్సవం కావించారు.

ఆనాటి సభ వందేమాతరం ప్రార్థనతో ప్రారంభం అయింది. ప్రార్థనానంతరం, సభ కార్యదర్శిని శ్రీమతి బి. తిమ్మమ్మాబాయిగారు ఉపాధ్యక్షులనూ, గవర్నరు శ్రీ మెహీ ఆహ్వానిస్తూ తమ సంతోషాన్ని తెలియ చెప్పారు. ఆమె ఆహ్వానంలో - సభ యింతవరకూ సాధించిన అభ్యుదయాన్ని పునశ్చరణ చేస్తూ ఉపాధ్యక్షులు మా సభకు రావడం యిదే మొదటిసారి కాదనీ ఇరవై సంవత్సరాల క్రిందట (1939)నే వారు యీ సంస్థను తిలకించారనీ జ్ఞాపకం చేశారు. ఆనాటికీ ఈనాటికీ సభ తన కార్యక్రమాలను విపరీతంగా విస్తరింప జేసింది- దీని కృషి యింతగా ఫలించడానికి సహృదయులైన పెద్దలందరూ కారణం అనీ, ఆంధ్ర సంస్థ అని పేరున్నా యీ సంస్థ సహాయ సహకారాలు పొందుతున్నది అన్ని జాతులవారూ, భాషల వారూ అనీ శ్రీమతి తిమ్మమ్మాబాయిగారు పేర్కొన్నారు. జాతిమత విచక్షత లేకుండా మహిళలకీ పిల్లలకీ చేయూతనిస్తూ వారి పురోగతికి పాటుపడ్డం మహిళాసభ ఆదర్శంఅన్నారు. గవర్నరు గారి సహకారానికీ మద్రాసు ప్రభుత్వ సహకారాకీ ప్రత్యేకించి కృతజ్ఞత తెలిపారు.

నర్సింగుహోమ్ వివరాలను విశదంగా సభికులకు చెప్తూ, యీ కొత్త ఆపరేషన్ థియేటరి సర్జికల్ బ్లాక్, - మద్రాసు ప్రభుత్వం యిచ్చిన లక్ష రూపాయల గ్రాంటుతో కట్టబడిందనీ. సర్జికల్ వార్డులో 20 మంచాలకు సదుపాయం వుందనీదానికి ఎక్విప్‌మెంటు గ్రాంటుగా కేంద్ర ప్రభుత్వం 50 వేల రూపాయలు యిచ్చిందనీ చెప్పారు డాక్టర్ పావనాబాయి.

మద్రాసు ప్రభుత్వ ఆరోగ్యశాఖ మంత్రి శ్రీ ఎమ్. ఏ. మాణిక వేలు సభకృషికి ఆమోదం తెలియచేస్తూ, ఇంతఉత్తమమైన సేవాలక్ష్యాలు కల సంస్థలకి ప్రభుత్వపు అండఎప్పుడూ వుంటుందన్నారు.

గవర్నరు శ్రీ మెహీ సభ కృషికి సంతోషపడుతూ. దానికి కుడి భుజంగా నిలచి సేవాతత్పరతకే మారుపేరుగా ఎన్న దగిన శ్రీమతి దుర్గాబాయిగారికి ధన్యవాదాలు అర్పించారు.

సర్. రాధాకృష్ణన్ ఉపన్యసిస్తూ మహిళా సభ కృషిని ఉద్ఘాటించారు. మొక్కవోని శ్రద్ధా శక్తులున్న వారు ఏ పని తలపెట్టినా దానికి విజయం లభించి తీరుతుంది. ఈ సంస్థ కార్యక్రమాలను తిలకిస్తూ వుంటే దానికి చక్కని భవిష్యత్తు ఉన్నదన్న మాట నిర్వివాదాంశం అవుతుంది. శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్‌గారి సేవానిరతిని కొనియాడుతూ ఆమె సేవ చేయడమే కాకుండా తన చుట్టూ వున్న వారిలో ఉత్సాహాన్ని రేకెత్తించి, వారినీ ఉత్తమమైన సేవికలుగా తయారు చేయడమే ఆవిడ ఘనత అన్నారు. రాజకీయాలు మానవులను పక్కదారులు పట్టిస్తాయినీ, వీటి మూలంగా

అసలు సమస్యలు పక్కకు నెట్టడం జరుగుతూం దనీ, దేశానికి ఎందరెందరో ఇంజనీర్లు, డాక్టర్లు, అవసరంగా వున్నారనీ వారితోపాటే సంఘ సేవికలు కూడా అవసరం అన్నారాయన, ఇటు వంటి ఉత్తమమైన కృషి ద్వారా సాధింప వలసిన అభ్యుదయం రాజకీయ లంపటాల మూల కంగా కుంటువడ్డం శోచనీయం, మన రాజకీ యపు నమ్మకాలు ఎటువంటివైనా దేశాభ్యు దయం కోసం వాటిని మరచి అందరూ ఒక్కటి అయి కృషి చేయాలి అన్నారు. సేవా దృక్ప థంలో జాతిమత బేధాల అవసరం లేదని ఆ విషయంలో మహిళా సభ కృషి మెచ్చతగ్గదనీ సర్ రాధాకృష్ణన్ అన్నారు. మన దేశంలో అసలు మహిళా పురోభివృద్ధికి నాంది పల్కినది మహాత్మాగాంధీ. దేశ విమోచనకై మహిళల సహాయాన్నభ్యర్థించారాయన. ఉత్సాహంతో అపిలుపునకు సమాధానంగా వేలకి వేలు ముం దుకి వచ్చారు. అప్పటి వరకూ యిల్లే సర్వంగా వున్న మహిళలలో నూతన చైతన్యం వచ్చింది. దేశానికి దేశదేశాల పేరుప్రఖ్యాతులువచ్చాయి. ఏ దేశంగాని అమరత్వం సాధించలేదు. కాని నైతికాదర్శాల పునాదిమీద నిలచిన దేశాలు తప్పక కలకాలం నిలిచివుంటాయి. త్వరిత గతిని సాధించడమే సవ్యం అని ఎంచుకొని క్షణికా లైనవాటికోసం సవ్యమైన వాటిని కాలదన్నుకు పోకూడదు అన్నారు ఉపాధ్యక్షులు.

శ్రీమతి ఎ. పర్వతవర్ధనిగారు అన్ని విధాలా సహకరించిన పోషకులికీ సభ్యులకీ అభిమానులకీ అందరికీ కృతజ్ఞత తెలిపారు.

నర్సింగుహోములో తర్ఫీదు నందుతున్న విద్యార్థినుల విజ్ఞానప్రదం అయిన వినోద ప్రదర్శ నంతో ఆనాటి సభ ముగిసింది. విచ్చేసిన వారం దరూ కొత్తగా కట్టిన భవనాలను తిలకించారు.



నవచైతన్యం:
ఆదిమవాసులకు విద్య.



ఒరిస్సాలోని 'గడబ బాలిక కొత్తగా అక్షరాస్య అవు తూంది. యుగ యుగాలుగా తమ జాతిలో ఏ ఒక్కరూ చూడని కొత్త జీవితాన్ని రుచి చూడడానికి యీ ఆదిమ వాసుల బాలిక కిది మొదటి సోపానం.

నూలు బుట్ట! పూల బుట్ట!

# అమెరికన్ వస్త్ర సుందరి

అమెరికన్ వస్త్ర పరిశ్రమ సుహృద్భావ రాయబారి "వస్త్ర సుందరి" (మెయిడ్ ఆఫ్ కాటన్) గతవారం భారత దేశం సందర్శించి బొంబాయి అధికారులను ఉల్లాస పరచింది. నూలువస్త్రాల అభివృద్ధి లక్ష్యంతో ప్రపంచ యాత్ర చేస్తున్న ఈ సుందరి జూను నెల 3వ తేదీన అమెరికాలో బయలుదేరి లండన్, ఏథెన్సు, బెయిరూట్, కరాచీ నగరాలు చూచుకొని ఇక్కడకు వచ్చింది.

భారత దేశంలో ప్రధాన వస్త్రోత్పత్తి కేంద్ర మయిన బొంబాయి తన హోదాకు తగినట్లుగా 21 సంవత్సరాల ఈ యువతి- మలిండాడిగ్స్ బెర్రీకి స్వాగతమిచ్చింది.

అమెరికా ఐరోపా కాకుండా ఈమె తొలి యాత్ర ద్వారా భారతీయ వస్త్రాలకు మంచి గిరాకి తగలటానికి తోడ్పడగలదు. పురాతన సాంఘిక సేవా సంస్థలలో ఒకటైన బొంబాయి స్టేట్ ఉమన్స్ కౌన్సిల్ సంస్థకు నిధులు పెరగటానికి ఈమె ఆగమనం తోడ్పడింది. తాజ్‌మహాల్ హోటలులో భారత దేశ వివిధ ప్రాంతాల దుస్తుల అలంకరణల ప్రదర్శనం, నృత్యాలు జరిగినవి.

బొంబాయి కాంగ్రెసు కమిటీ అధ్యక్షులు శ్రీ కె. కె. షా ఒక ప్రసంగంలో ఈమె పర్యటన విజయాన్ని ఉగ్గడించారు. ఇండియా టూరిస్టు క్లబ్బు ప్రెసిడెంటుగా ఆయన మిస్ బెర్రీకి జరిగిన ఒక సన్మానోత్సవంలో ప్రసంగిస్తూ ఇట్లా అన్నారు. "ఈ దేశంనుంచికూడా ఒక "వస్త్ర సుందరి"ని పంపటానికి అవకాశం కల్గుతుందని భావిస్తున్నాను."



బొంబాయి విమెన్సు కౌన్సిల్ సభ్యురాలు శ్రీమతి మీనాక్షీ బాక్లే, అమెరికన్ వస్త్ర సుందరి మెలిండాలో.

జస్ బెరీ స్టిల్ వాటర్ (ఓకహామా) నివాసిని. అమెరికన్ వస్త్ర పరిశ్రమయొక్క 21 వ సౌహార్ద, ఫేషన్ రాయబారి. అమెరికా నేషనల్ కాటన్ కౌన్సిలు జరిపే వస్త్ర సుందరి పోటీ ప్రపంచ ప్రఖ్యాతమైనది, ఇది వస్త్ర పరిశ్రమ పట్ల అమెరికా తదితర దేశాలలో సద్భావం, ఆశక్తి పెరగటానికి వస్త్ర విక్రయం పెంపొందింప చేయటానికి తోడ్పడుతున్నది. నూలు బట్టలు అన్ని ఋతువులలో పనికివచ్చే గుడ్డల చలామణికి ఈ కౌన్సిలు దాదాపు 8 సంవత్సరాలుగా ఉద్యమం సాగిస్తున్నది.

ఈ "వస్త్ర సుందరి" బొంబాయినుంచి బాంకాక్, టోకియో, ఒసాకా, హాంకాగ్, సిడ్నీ, బ్రిస్బేన్, మెల్ బోరన్, హానలూలు సందర్శించి తిరిగి అమెరికా చేరుకుంది.

మెలిండా ఓక్లహామాస్టేట్ యూనివర్సిటీలో జూనియర్ విద్యార్థిని, ఇంగ్లీషు లిటరేచర్, హిస్టరీ చదువుతున్నది. ఈ బిరుదు పొందిన ఓక్లహామా వనితలలో ఈమె రెండవది. ఈమె తండ్రి నూనె ఉత్పత్తిదారు. మెలిండా రకరకాల దుస్తులు కట్టగలదు. స్కీయింగ్, స్కేటింగ్ అంటే అభిమానం.

డిసెంబరు 13 న మెంఫిస్‌లో 20 మందిని ఓడించి 21 వ వార్షిక "పత్తి పడుచు" బిరుదు పొందింది. దీనికి ఏడుగురు జడ్జీలుంటారు హౌస్ కీపింగ్ పత్రిక బ్యూటి ఎడిటర్ జడ్జీల బోర్డు అధ్యక్షురాలు. అందం, హుషార్ వంశం వగైరా అంశాలు చూసి పెళ్ళికానివారికి ఈ బిరుదిస్తారు.

నేషనల్ కాటన్ కౌన్సిల్ జరిపే ఈ పోటీలో ఇదివరకు ఎన్నికైనవారిని ఐరోపా, ఆమెరికాలకు పంపేవారు. ప్రపంచ పర్యటనకు పంపటం ఇదే మొదటిసారి. అన్ని దేశాలలో నూలు వస్త్రాలపట్ల శ్రద్ధాసక్తులు పెంపొందించటం ఈపర్యటన లక్ష్యం. ★



# ANDHRA MAHILA SABHA

## NURSING HOME & NURSES' TRAINING CENTRE

### Statistics for the month of June '59.

**OUT-PATIENT REGISTER**

| | |
|---|---|
| No. of Surgical cases treated | 91 |
| ,, ,, Medical ,, ,, | 1,339 |
| ,, ,, Gyneac ,, ,, | 176 |
| ,, ,, Ante-natal ,, ,, | 348 |
| ,, ,, Post-natal ,, ,, | 110 |
| ,, ,, Dental ,, ,, | 11 |
| ,, ,, E.E.N.T. ,, ,, | 81 |
| Total Number of New Patients | 2,156 |
| Total Number of Old Patients | 2,865 |
| Grand total | 5,021 |

**ADMISSION REGISTER**

| | |
|---|---|
| No. of normal deliveries | 159 |
| ,, ,, Abnormal ,, | 14 |
| ,, ,, Antenatal cases with False Pains | 28 |
| ,, ,, Antenatal cases with Toxaemia | 6 |
| ,, ,, Post-natal cases | 4 |
| ,, ,, Gyneac ,, | 29 |
| ,, ,, Medical ,, | 77 |
| ,, ,, Babies admitted as Lodgers | 176 |
| Grand total | 493 |

(Sd.) Dr. K. R. AMBUJA,
*R. M. O.*

(Sd.) Dr M. PAVANA BAI,
*Medical Superintendent.*

(Sd.) Smt. V. LAKSHMI PARVATHI
*Secretary.*

Edited, Printed & Published by Mrs K. Lakshmi Raghuram, B A., at the Andhra Mahila Press
Mylapore, Madras 4. Manager and Associate Editor: Ramalakshmi Arudra